ఓమ్

బమ్మెర పోతనామాత్య ప్రణీతంబైన

# శ్రీమదాంధ్రమహాభాగవతము

## షష్ఠస్కంధము



సంపాదకులు : ప్రకాశకులు

**రెంటాల శివరామయ్య**

చిగురుపాడు, అచ్చంపేట పోష్టు
సత్తెనపల్లి తాలూకా, గుంటూరుజిల్లా.

కాపీరైటు] [రు. 4-0-0

# సూచన:-

ఏర్చూరి సింగనామాత్యుడు పూరించిన శ్రీమదాంధ్ర మహా భాగవత షష్ఠ స్కంధమునందును, ఈషష్ఠ స్కంధమునందును కలయి కలుగల గద్య పద్యములు యీక్రింది సంఖ్యలు గలవి యని తెలుపు కొనుచున్నాను.

**154 155 156 157 158 159 160 161 162 163 164 165 166 167 168 169 170 171 172 173 174 175 176 177 178 182 253 254 255 256 257 258 259 260 261 262 277 278 279 280 281 282 283 284 285 286 287 288 289 290 291 292 293 294.**

ప్రకాశకులు

# విషయసూచిక

## షష్ఠ స్కంధము

## బమ్మెర పోతనామాత్యుఁడు



'పలికెడిది భాగవతమఁట, పలికించెడువాఁడు రామభద్రుండఁట, నేఁ
బలికిన భవహర మగునఁట! పలికెద వేఱొండుగాథ పలుకఁగనేలా!'

శ్రీ ప్రకృతి దేవ్యైనమః

# భాగవతస్తుతి

క॥ కృతి భాగవతాఖ్యంబఁట, కృతికర్తట పోతరాజు కృతిపతి సీతా
పతియఁట జదివిన వినినన్ । కృతకృత్యుల మగుదుమంట కువలయమందున్.

క॥ పలికించి పలుకుపలుకున । చిలికించి సుధారసంబు సీతాపతి దాఁ
దిలకించు చూరకుండునె ! । బలుగాకులు సిలుగువెట్ట భాగవతంబున్.

క॥ దలఁచిన గొలచినవారల । కలికల్మషహారివమ్మ కామితమిమ్మా
తొలి నే జేసిన పూజా । ఫలమున లభియించితమ్మ భాగవతమ్మా !

చ॥ దొరికితివన్న సంతసము, దుర్భరదుస్థితిలోన నా కయో
దొరికితివేలనా యనెడి దుఃఖము, రెంటను నేకమై మదిన్
పురిగొని క్రిందుమీదగుచుఁ బోవని ప్రాణముతోడ నుంటినో
పరమపవిత్రగాత్రి ! యల బమ్మెరపోతనకావ్యకన్యకా !

చ॥ పరగృహవాసగ్రాసములు బాయని దుర్గతి బట్టినట్టి న
న్నెరిగి యిటొచ్చితీ వకట ! యేమియొనర్తునొ తెల్పుమమ్మ ! స
చ్చరితవు నీవు సుమ్మ యిదె సన్నుతిజేసెద గైకొనమ్మ, వో
పరమపవిత్రగాత్రి ! యల బమ్మెరపోతనకావ్యకన్యకా !

ఉ॥ జీవము బోని కాయమున జిక్కులు పెక్కట స్రుక్కుచున్న నీ
దేవిధ సేవ కర్హుడని యెంచి యిటొచ్చితివో గదమ్మ, నీ
భావ మదెట్టిదో తెలుపు, భక్తిని నా తలఁదాల్తునమ్మ నీ
పావనపాదపద్మములు, బమ్మెరపోతనకావ్యకన్యకా !

క॥ భూ తనయయు, పోతనకవి । తాతనయయు, తుల్యపుణ్యాతరుణీమణులై
ఖ్యాతింగాంచిరి జగముల । సీతా భాగవతనామస్వీకృతు లగుచున్ ॥

రెంటాల శివరామయ్య,
సంపాదకుఁడు.

# నా తొలిపలుకు

సీ॥ చాడేశ్వరీమహాశక్తి నారాధించు నాచకాశిపుర నివాసకులము
నందమహారాజ సందేహములనెల్ల మొదలంటబాపిన మొదటికులము
గోల్కొండపాదుషా కోర్కె లీడేర్చిన సాంగ శాబరివిద్యసాధకులము
కలియుగ మేకైక ఘన పాదమియదాంక దానభాస్కరుని వదాన్యకులము

గీ॥ వేదవేదాంగభాసితవైదికులము । భావవిలసిత దేదీప్త పావకులము
శ్రీసహిత సకలభూత మోదకులము । అందమగు నందవర యగ్రహారికులము.

క॥ పాటించ నందవరీకుండ । భారద్వాజాన్వయమున బరగెడివాడన్,
ధారుణి శివరామాఖ్యుండ । శ్రీరఘువర బ్రోవు నన్ను సీతారమణా !

నా జన్మస్థలము పల్నాడుసీమయందలి రెంటాల గ్రామము. కారణాంతరములచే కొన్నివత్సరములనుండి సత్తెనపల్లితాలూకాయందలి చిగురుపాడుగ్రామమున నామేనల్లుడగు చి॥ వేల్పూరు వేంకటలక్ష్మీనారాయణ గృహమందు నివసించుచున్నాను. ఆరుసంవత్సరములక్రిందట పల్నాడునందలి శ్రీగిరిపాడుగ్రామమున కరుగుట సంభవించినది. అందు బ్రహ్మశ్రీ పుల్లాభొట్ల జగన్నాధావధానులుగారి యింట నతిథిగానుండ వారికి జాతాశౌచ మొచ్చుటయు, వారి గృహదేవతార్చనము చేయుటయు నాకు సంభవించినది. అర్చనాసమయమున భువనేశ్వరంబున నతిపురాతన తాళపత్రగ్రంథ మొకటి గోచరింప నేమిగ్రంథమాయని, తద్గ్రంధబంధనసుదీర్ఘరజ్జువు నూడదీసి చూడ నది ప్రథమాదిషష్ఠస్కంధాంతమువరకుంగల శ్రీమదాంధ్రమహాభాగవతంబై యుండుటయు, తదుపరి గ్రంథాంత్యభాగంబున గల కొన్నియాకులు నెత్తిచూడ షష్ఠస్కంధము ప్రారంభమై కందపద్య మాదియందు గనుపించుటయు, శ్రీరామాంకితమై యుండుటయు తటస్థింప, యితఃపూర్వ భాగవత షష్ఠస్కంధాదియందు శ్రీమహావిష్ణుపరమైన శార్దూలవృత్త ముండుట స్ఫురణమున కొచ్చి విస్మయ మొందవి మరికొన్ని పద్యములు చదువ నత్యంత వ్యత్యస్తమైనట్లు దోచినది. తదుపరి దేవనివేదనాదికము లొనర్చి గృహమేధిం గలసి సంతృప్తిగ భుజించి, మరుసటిదినంబున పయనంబగు తఱి నాబ్రాహ్మణోత్తమునితో 'అయ్యా తమ గృహమందుగల తాళపత్రలిఖిత భాగవత గ్రంథ మొసంగుడు రేని నేనును పూజించుచు పఠించుకొందు' నన, చిరునగవున గొనిపొండని యాజ్ఞయిడ మహానంద మొందుచు పేదకు పెన్నిధిలభించినట్లు స్వగృహంబున కొచ్చి గ్రంధం బామూలాగ్రముగా చదివి పంచమస్కంధమున కొలదిగను, షష్ఠస్కంధ మత్యంతభేదముగను గనుపట్ట పండితుడగాని నేను ఇదమిత్థమనజాలక గ్రంథ

మును దానమిచ్చిన అవధానులవారి సన్నిహితబంధు వగు జ్యోతిర్విద్వాన్ బ్రహ్మశ్రీ పుల్లాభొట్ల లింగయ్యసిద్ధాన్తిగారితో గ్రంథసవిస్తారమంతయుం దెలుప, వారు దానిం గాంచి ఆనందభరితులై సత్వర గ్రంథముద్రాపణ మొనర్పుమనిరి. పిమ్మట రేపల్లెనివాసు లగు మహారాజశ్రీ వేమూరి వెంకటేశ్వర్లుపంతులుగారు, శ్రీదక్షిణామూర్తిగార్లకు యేతద్గ్రంథ సవిస్తారమును వినుపించి చూపింపగా వారును మహానందమొంది అవ్వాచ్త్రింప మాసంపూర్ణాభిప్రాయమని నుడివిరి. తదనంతరము కొంత ధైర్యమూని ధనాభావ, మనోవేదన మహాక్లిష్టపరిస్థితులం దుండినను, గ్రంథప్రచురణ మహాభాగ్యాసక్తుండనై. కాగితములపై ముద్రణాయుక్తమగునట్లు ప్రతిని వ్రాసికొని సుముహూర్తమును కెదురు చూచుచుండ చి॥ వేలూర్వారి వేంకటలక్ష్మీనారాయణగారును; గుంటూరునివాసులగు నా చిరమిత్రుడు చి॥ మునగపాటి వేంకటేశ్వర్లుగారును నామనోవేదన నెరిగి గ్రంథ సముద్ధరణార్థద్రవ్యసర్వసహాయాదు లొనర్ప నునకట్టిరి, యెల్లభంగుల శ్రీసుదాంధ్ర మహాభాగవతసేవాధురంధరులైనా రనుట కెట్టి సంశయాస్పదములు లేవు. వారు సహజ సుగుణోదారులు. అందు శ్రీవేలూర్వారి వేంకటలక్ష్మీనారాయణగారు.

సీ॥ పచ్చిగంగైనను పుచ్చుకో దలఁచిన భగవతార్పణ మని పలుకువాఁడు
యెన్నిప్రశ్నాక్షరా లన్ని యక్షరములే పెచ్చులేకను జవా బిచ్చువాఁడు
పొరపాటుగానైన బొంకాడగా బోని నిత్యవాగ్వైభవ నియతరతుఁడు
నెర సాకింతయు లేని నిరుక్తైనమునమున యేకపత్నీవ్రత మెంచువాఁడు

గీ॥ కశ్యపప్రజాపతి యను ఘనమహర్షి గోత్రసంభవమైన వేలూర్వారువంశ
జనిత శోభిత నరశింహరావుకాంబ సుతుడు లక్ష్మీనారాయణ సుజనహితుఁడు.

మఱియు, మునగపాటి వేంకటేశ్వర్లుగారు.

క॥ మిత్రుండు మునగపాడ్వం। శాత్రేయసగోత్రజనితు డనవరతంబుక్
స్తోత్రార్హు వేంకటేశ్వర ధాత్రీశ్వరు డన్నదానతత్పరుఁ దలఁతున్.

ఇట్టి మహోపకారపారీణుల సహాయముతో గుంటూరుపట్టణనివాసులగు వే॥ బ్రహ్మశ్రీ రాయప్రోలు లింగనసోమయాజిగారు, వారికుమారులు శ్రీ కుమార వేంకటరమణశాస్త్రిగారలు స్థాపించిన దేవనాగరిపవర్ ప్రెస్‌నందు ముద్రణకై గ్రంథ మొసంగితిని, వారు దానిని సాంగోపాంగముగా జూచి లేఖకప్రమాదము లున్నందున వాటిని తగువిధసవరణకు వే॥ బ్రహ్మశ్రీ నోరి నరసింహశాస్త్రిగారు తగు సమర్థులని సూచించిరి. నే నంతట రేపల్లెయందుగల వారి స్వగృహంబునకుం జని మూర్తీభవించిన బ్రహ్మతేజోవిరాజితులగు వారికి నమస్కరించి, మదాగమన కథావిశేషమంతయుం దెల్పి గ్రంథం బొసంగిన, వారు ఆమూలాగ్రముగా పరిశోధించి వల్లెయని నాయందు

పుత్రవాత్సల్యముతో సమయసముచిత సరససారస్వత పరిరక్షణీయపదప్రయోగనిశిత నిదర్శనవిపన్నవాసత్కృదర్శనీయుండును, సంస్కృతాంధ్రాంగ్లేయభాషాధురంధరుండును, శ్రీమదాంధ్ర దేవీభాగవతాది బహుప్రబంధ గ్రంథకర్తయు, కవిసామ్రాడ్బిరుదాంకితుండును నగు శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు యేతద్గ్రంథపరిష్కృతులునై పీఠిక నొసంగినారు. సర్వకాలసర్వావస్థలయందు వారికి నామనఃపూర్వక శతసహస్రానేకనమస్కారములు.

క॥ హరిచరణస్తోత్రద్రవభూ । సు॥ నోర్వ్యాప్తబిసశుభ్రాంశునిభు
న్నరసింహశాస్త్రి కవిరా । ణ్ణిరతము దలంచెదను మదిని నిక్కపుభక్తిన్.

భాషాభిమానపండితపాఠకభక్తమహాశయులందరకు హృదయపూర్వక నమస్కారము లొనర్చి, యీగ్రంథముపై గల మీ మీ యభిమతాభిప్రాయము లెట్లుండ గలవో నిర్ణయింపగల సత్కాలాగమనమునకు నిరీక్షసేయుచు, మీయందర కీగ్రంథము దొరికినతీరును, ప్రకటనమొందిన తెన్నును విజ్ఞప్తిసేసికొనుచున్నాను.

చిగురుపాడు
10—2—1954

భాగవతసేవ్యుఁడు
రెంటాల శివరామయ్య.

# జిజ్ఞాస

ఇదియొక యపూర్వానుభవము. బహుకాలముగా వివాదాంశముగా నున్న బమ్మెర పోతనామాత్యుని మహా భాగవత పురాణమునుగూర్చి దీనితో మరియొక యపూర్వవాదము రాగలదు. ఇంతవరకును ముఖ్యముగా రెండేవాదము లున్నవి. పోతనామాత్యుడు పూరించిన మహా భాగవతగ్రంథము రాజాగ్రహముచే శిథిలము కాగా పిమ్మట శిథిలమైన భాగములను గంగయ, శింగయ నారయలు పూరించిరని పెద్దల నానుడిలోనున్న కథ యొకటి.

ఏ కారణముచేతనో కొన్ని భాగములు పోతన వ్రాయక వదలివేయగా నవి యా ముగ్గురు కవులును బూరించిరని రెండవ మతము. ఈ రెండు మతములవారికిని వాదోపవాదములు చెలరేగినవి. ఊహలు పెరిగినవి.

ఇట్లుండగా నిప్పుడు శ్రీ రెంటాల శివరామయ్యగారి కృషివలన మూడవ మతమునకు అవకాశ మేర్పడినది. పోతనామాత్యుడు శ్రీ మహా భాగవతమును సంపూర్ణముగనే రచించెను. దాని ప్రతులు పూర్తిగా నశింపనేలేదు. పోతన కవిత్వమందు అభిమానముగలవారు పోతనగ్రంథమునే యథామూలముగా వ్రాసికొనుచునే వచ్చుచున్నారు. దేశ మల్లకల్లోలముగ నున్నసమయమున ఆ సంపూర్ణప్రతులు లభింపక నశించినవని భావించి వారికి దొరకని భాగములు గంగయాదులు పూరించియుందురు. కాని మూలగ్రంథప్రతులు పూర్తిగా నశింపలేదు. అందులో మొదటి ఆరుస్కంధములు పూర్ణముగా ఈమధ్య ఆంధ్రుల యదృష్టవశమున లభించినవి.

శ్రీ శివరామయ్యగారు పండితులుగారు, కవిగాదు, సంపన్నుడైననుగాదు. తన స్వగ్రామమగు గుంటూరుజిల్లా సత్తెనపల్లితాలూకా చిగురుపాడు గ్రామములో దన కున్న కొద్దిపాటి పొలమును వ్యవసాయము చేసికొని జీవనము గడపు పేదహాలికుడు. ఐనను ఆ వృత్తినే యవలంభించిన పలువురాంధ్రులకువలెనే ఆంధ్రకవిత్వమందు గాఢమైన ప్రీతిగలదు. అందును హాలిక కవిచక్రవర్తియగు పోతనయందు ప్రత్యేకాభిమానము, భక్తిగౌరవములు గలవు.

వారు కార్యాంతరముచే పల్నాడుతాలూకా శ్రీగిరిపాడు గ్రామము వెళ్ళుట తటస్థించినది. అప్పుడు వారు భోజనముచేసిన బ్రాహ్మణగృహములో జాతాశౌచము వచ్చుటచే గృహదేవతానివేదనముచేయుపని వారి పాలబడినది. అక్కడి దేవతార్చనములోని సాలగ్రామాదులతోపాటుగా నొక ప్రాత తాళపత్రగ్రంథముగూడ నుండెను. గ్రంథముచూడగనే లోపల చూడవలెనను సహజలౌల్యముచే వా రది విప్పి తిలకింప సాగిరి. శ్రీ మదాంధ్ర మహా భాగవతము, షష్ఠస్కంధము అను దాని వెంటనే కంద పద్యము కనుపించినది. వా రెరిగిన షష్ఠస్కంధము శార్దూలవృత్తముతో ప్రారంభించి శ్రీరామచంద్ర సంబోధనము లేనిదని గమనించి, చిత్రముగా దోచి చదువసాగిరి. వెంటనే కథాఘట్టము వచ్చినది. చదివినకొలదియు తాను మున్నెఱిగిన షష్ఠస్కంధము కంటె పూర్తిగా భిన్నముగా నున్నది. అంతట చివరకు త్రిప్పి గద్యము చూచునుగదా

పోతనామాత్యునిచే నిస్సందేహముగా రచింపబడిన స్కంధాంత గద్యములందువలెనే "ఇతి శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీ మహాభాగవతం బను మహా పురాణంబునందు.........
...........అను కథలుంగల షష్ఠస్కంధము" అని యున్నది. అది చూచి వారు ఆనందముతో లబ్బిబ్బగుచు నా గ్రంథములోని పంచమస్కంధాంత్య గద్యము చూడ నందుకూడ పోతనామాత్యుని గద్యముగనే కనుపించినది. స్కంధాది పద్యము శ్రీకృష్ణ సంబోధనముగాక శ్రీరామచంద్ర సంబోధనముగా నుండుట గమనించిరి. వారికి పెన్నిధి దొరికినట్లు తోచినది.

వా రంతట భోజనానంతరమున నాగృహస్థును యీ గ్రంథము నాకిత్తురా పూజించుకొందునని యర్థింపగా దనకు బూజలో గొంతబరువు తగ్గుచున్న భావను ప్రకటింపుచు సంతోషముతో వారి కొసంగిరి.

శ్రీ శివరామయ్యగారు ఆ గ్రంథము నింటికి దెచ్చుకొని చదివి దానిని చూచి యొక వ్రాత ప్రతి కాగితములపై సిద్ధముచేసిరి. అవి రెండును వా రెరిగిన కొలది మందికి చూపుచురాగా తప్పక ప్రచురించవలసినదని వారిని ప్రోత్సాహపరచిరి.

ఇది జరిగి రమారమి ఆరుసంవత్సరములైనను ధనాభావముచే వా రాపనికి బూను కొనలేకపోయిరి. ఇంత విలువగల గ్రంథమును ప్రకటనార్థ మితరుల కిచ్చుటకు వారికి సమ్మతి గాకపోయినది. గ్రంథములో అతిమాత్రముగా లేఖక దోషములు గలవు. ఏమిచేయుట యని యాలోచించిరి.

ప్రస్తుతము ఉపలబ్ధమైన శ్రీ మహా భాగవతము ముద్రితప్రతులతో వారియొద్ద నున్న తాళపత్రప్రతిని పోల్చిచూడగా వారి కీ క్రింది విషయము లవగతమైనవి.

1. ముద్రితప్రతులలోని మొదటి నాలుగు స్కంధములకును యీ ప్రతిలోనివానికిని విశేషభేదములు లేవు.
2. పంచమస్కంధములో గూడ కొలదిభేదములు తప్ప విశేష భేదములు లేవు. మొత్తముమీద రెండును నొకేవిధమున నున్నవి.
3. షష్ఠస్కంధములో ముద్రితప్రతిలోని 54 గద్య పద్యములు మాత్రము మొత్తము మీద నొకటిగా నుండి మిగిలినవన్నియు నీ వ్రాతప్రతిలో భిన్నముగా నున్నవి. అందులో 530 గద్య పద్యము లుండ నిందులో 468 గద్య పద్యములు గలవు. కథాసందర్భములు, క్రమములుకూడ రెండును వ్యత్యాసముగా నున్నవి.

పై విషయములు గమనించి వారు తమకు దొరకిన ఆరుస్కంధములు ప్రచురించు భారముపెట్టుకొన నక్కరలేదనియు షష్ఠస్కంధ మొక్కటి ప్రచురించినచో ఆంధ్ర వాఙ్మయమునకు మహాసేవ చేసిన పుణ్యము తనకు లభించుననియు భావించిరి. దానికై నను అవసరమగు నార్థికబలము లేకున్నను సాహసించి గుంటూరులో శ్రీ రాయప్రోలు లింగన సోమయాజులుగారి కుమారులు శ్రీ కుమార వేంకట రమణశాస్త్రిగారు స్థాపించిన దేవనాగరి పవర్ ప్రెస్‌లో అచ్చు కిచ్చిరి. మొదటిఫారము ప్రూఫులు చూచుచుండ

గనే లెక్కలేనన్ని వ్రాతతప్పు లుండుటచే వానిని సవరించినగాని ప్రచురించుట భావ్యముగాదని వారు సూచించిరి. ఇది సరిచేయగలవారి నెవరిని శివరామయ్యగారు తా మెరుగమని సూచింప నా మీదగల ఆదరాభిమానములచే వారు నాపేరు సూచించి, మొదటిఫారము మెషిన్ ప్రూఫ్‌తో సహా శ్రీ శివరామయ్యగారిని నాయొద్దకు బంపిరి. నేను గ్రంథసంస్కరణములో ననుభవ మున్నవాడను కా ననియు మరి యెవరినైనను చూడవలసినదనియు వారికి జెప్పితిని. అయినను వారు నన్ను నిర్బంధించుటచే నే నీ పనికి బూనుకొంటిని.

నేను యీ వ్రాతప్రతి పరిష్కరించుటలో ముఖ్యముగా నీ క్రింది నియమము లవలంభించితిని.

1. నిస్సందేహముగా వ్రాతతప్పులను సవరించితిని.

2. పదరూపము ఏ మాత్రము వాదించుటకు అవకాశ మున్నదని తోచినను వ్రాత ప్రతి పాఠమునే యుంచితిని.

3. గణభంగముగాని యతిప్రాసభంగములుగాని స్పష్టముగా కనుబడుచున్నచోట్ల యెంత తక్కువ అక్షరములు మార్పుచేయ వీలగునో అంతవరకే చేసితిని. పద్యము యేమాత్రమును బాగుగా లేదని తోచినచోట్లకూడ నా స్వంత కవనమును చేర్పుటకు సాహసింపలేదు. ఈ నియమములు పెట్టుకొనుటచే సామాన్యముగా పరిష్కరింపతగిన వెన్నియో వదలివేసితిని. చేతనైనంతవరకు ప్రాతప్రతిని ఆంధ్రలోకము నెదుట నుంచుటకే ప్రయత్నించితిని. నేను ప్రూఫును చూచు నవకాశము లేకపోవుటచే నిప్పుడు చూచుకొనగా నేను దిద్దిన తప్పులు కూడ సరిగా అచ్చులోనికి రాలేదని తోచుచున్నది. ఏమైననేమి యీ గ్రంథము పండితులయెదుట నేదో రూపముగా పెట్టుటయే శ్రీ శివరామయ్యగారి ఆశయము. వా రందులో ధన్యులైరని చెప్పగలను.

ఈ గ్రంథము బయటబడుటచే శ్రీ మహా భాగవతమునుగూర్చి క్రొత్త వివాదములు పుట్టుట కనేకావకాశము లున్నవి. ఈ క్రిందివానిలో నేవిధముగా నూహించుటకైనను నవకాశము గలదు.

1. పంచమస్కంధములో రమారమి 20 గద్య పద్యములుమాత్రము తనవి దూర్చి గంగనార్యుడు గద్యములో తానే స్కంధ మంతయు రచించితినని దిద్ది యుండవచ్చును.

2. షష్ఠస్కంధములో తనకు శిథిలమైన ప్రతి యొకటి దొరకగా అందులో నున్న 54 గద్య పద్యములను కొద్దిమార్పులతో అట్లేయుంచి సింగయ మిగిలిన స్కంధ మంతయు తనపేరనే పూర్తిచేసి యుండవచ్చును.

3. ఇప్పుడుదొరకిన వ్రాతప్రతియే పూర్వము నెవరో కవి పోతనపేరనే పూర్తిచేసి యుండవచ్చును.

మూడవపక్షము వాస్తవమని వాదించుటకు కొన్నిచిక్కులు గలవు. పోతన రచించినట్లు చెప్పదలంచినవాడు గంగయ, శింగయల గ్రంథభాగములు యేమాత్రము కాకుండ జేయునుగాని కొన్ని ఏల రానిచ్చును? ఎంతవాడైనను పోతనవలె నుండునట్లు కవిత్వము జెప్ప సాహసించియుండునా?

ఈ గ్రంథ ప్రచురణము సంగతి పత్రికలలో ప్రచురింపబడినంతనే కృష్ణాపత్రిక 22-8-53 తేదీగల పత్రికలో శ్రీ పెద్దిభొట్ల వీరయ్యగారి వ్యాస మొకటి ప్రచురింప బడినది. అందులో నీ గ్రంథములోని ఆద్య కందపద్యము నుదహరించి యందులో పెద్ద సమాసము లుండుటచేతను, పోతన కందములలో ముప్పాతికమూడువీసములలో నున్న పద్ధతికి విరుద్ధముగా నిది యుండుటచేతను ఈ గ్రంథము పోతన విరచిత మనుటకు నెట్టి యవకాశమును గన్పడుటలేదని నిర్ధారణచేసిరి. అట్టిది యెంత తొందరపాటు నిర్ధారణమో విజ్ఞులే యూహింపగలరు. ఆ వ్యాసమువలన నాకు పూర్వము తెలియని విషయ మొకటి తెలియవచ్చినందు కెంతయు సంతసమైనది. పూర్వము శ్రీ శేషాద్రి రమణకవులకు, బమ్మెరకు సమీపమునగల 'వేల్పుకొండ' యనుచోట పోతనకృత మగు ద్వాదశస్కంధములు గల భాగవతము లభించినదనియు, అది పరిషత్తులో గలదనియు, నది శ్రీ సూర్యారావుగారు శోధించి పోతన విరచితముగా దని తేల్చిరనియు నావ్యాస మున వారుటంకించిరి. కాబట్టి ఇప్పుడిందుతో ప్రచురించుచున్న ప్రతి మొదటిది కాదని తేలగలదు. అదియు నిదియు నొకటేనైన శ్రీ సూర్యారావుగారి యభిప్రాయము విలువగలదేయైనను మరల వారును, దేశములోని యితర పండితప్రకాండులును, భాగవతాభిమానులును పునర్విచారణ చేయవలసిన యవసర మేర్పడగలదు.

ఇప్పుడు ప్రచురించుచున్న షష్ఠస్కంధముపై నా కట్టి ప్రత్యేకాభిమానమును లేదు. పోతనయుత్తమకవిత్వరీతులు కనుపించు ఘట్టములలోని యుదాత్తకవిత్వము యిందులో కనబడుటలేదు. కాని, యిది యెక్కడను గంగయ, శింగయల కవిత్వమునకు దీసిపోవుటలేదని నిశ్చయముగా జెప్పగలను. రసజ్ఞులైనవారు నిష్పక్షపాతముగా నీగ్రంథమును పరీక్షించి, పోతనరచిత మగునో కాదో నిశ్చయింతురను నుద్దేశ్యముతోడనే శ్రీ శివరామయ్యగారు దీనిని ప్రచురించుచున్నారు. ఇది పోతనకృతమని పెద్దలు నిర్ధారణచేసిన సంతోషమే. కాకున్న గంగయ, శింగయలకు దీసిపోని మరియొక కవి రచించిన మహాభాగవత భాగమును ప్రచురించుచున్నందుకైనను శ్రీ రెంటాల శివరామయ్యగారు కృతార్థులే.

| | | |
|---|---|---|
| రేపల్లె,<br>విజయ పుష్య బ ౯<br>బుధవారము.<br>(27-1-1954) | } | నోరి నరసింహ శాస్త్రి |

శ్రీ ర స్తు

శ్రీ రామచంద్రాయ పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర మహాభాగవతము

## షష్ఠ స్కంధము



క. శ్రీ విశ్వంభరాభరణ
ప్రావీణ్యవిభాసమానఫణిరాణ్ణిభ బా
హావిపుల! విజయమోహన!!
రావణమదకరిమృగేంద్ర! రామనరేంద్రా!! 1

వ. మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైన సూతుం డిట్లనియె నట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని- 2

సీ. వేదాంతరూప నివృత్తిమార్గంబును
వరుస సంసార ప్రవర్తనంబుఁ
బ్రకృతిజంబైన స్వర్గంబు పాతకభోగ్య
నరకలక్షణము మన్వంతరములు
ధరణిఁ బ్రియవ్రతోత్తానపాదుచరిత్ర
వార్ధిసదీద్వీపవర్షములును
సరవి భూగోళసంస్థానంబు నక్షత్ర
వసుమహీంద్రాద్రిమవాసములును

తే. గీ. మొదలుగాఁగల సర్వంబుఁదుదకువెడల
వింటి మీవల్ల యోగీంద్ర వేడ్కతోడ
యాతనలఁబొంది నరులు నేరీతి నరక
మనుభవింతురు తెలియంగ నానతిమ్ము. 3

## నరకనిరూపణము

వ. అని పలికిన రాజుకు మునివరుం డిట్లనియె. 4

క. మనమునఁ గాయంబున వా
క్కునఁ జేసిన పాతకంబు క్రూరంబగు యా
తనబొంది నరులు నరకం
బునఁ గూలుదు రధికదుఃఖమునఁ బరవశులై. 5

చ. ప్రకటమనుష్యదేహములఁ బర్విన రోగచయంబులన్ జికి
త్సకుఁడు విమర్శ జేసి యవి జాఱెడు నట్లుగ నౌషధక్రియన్
సుకరముతోడ నిచ్చుక్రియఁ జొప్పగు మృత్యువు రాకమున్నె పా
తకముల నొంపఁగావలయుఁ దద్దయు శ్రీహరి నామకీర్తనన్. 6

వ. అనిన రాజిట్లనియె. 7

క. కలుషప్రాయశ్చిత్తం
బులు సేసెడి నరులపాపములు నసియింపన్
గలభస్నానముక్రియగను
దలఁచెద మనమునను సర్వతత్వార్థనిధీ! 8

వ. అనిన యోగీంద్రుం డిట్లనియె. 9

చ. అనయము మానవుండు రుచిరాన్నము పథ్యముతోడుతన్ భుజిం
చిన యెడ నొందురోగములు సెందనిమాడ్కి హరిప్రియంబుగా
మునుకొని నిత్యకర్మములు ముందుగ నాచరణంబు వేడ్కఁ జే
సినపుడ పాపసంఘములు సేరవు పుణ్యము లబ్బు నెయ్యెడన్. 10

వ. మఱియుఁ దపఃకారణంబులైన బ్రహ్మచర్యంబును, శమంబును, దమంబును, సత్యంబును, శుచిత్వంబును, దయయును, దానంబును, మొదలైన నియమంబులచేత వేణుస్తంభంబుల ననలంబుసోఁకిన క్రియఁ బాతకంబులు సమూలంబులుగా నడంగు. కొందఱు పుణ్యవంతులు వాసుదేవపాదభక్తిపరాయణులై విష్ణుగుణస్థితిసామర్థ్యంబు వలన సూర్యుండు నీహారంబు బడంచుక్రియఁ గలుషంబుల నాశంబుసేయుదురు పాపకర్మలు విష్ణుకర్మచేతం బవిత్రులైనట్లు

యజ్ఞాదిక తంత్రంబులచేతం బవిత్రులుగా నేరరు. అట్టి యజ్ఞాదిక తంత్రంబులు, 11

ఆ. వె. మద్యభాండపూర్ణ మగు తీర్థజలములు
నౌరు పవిత్రు జేయనోపనట్లు
హరిపరాఙ్ముఖంబు లైన యజ్ఞాదులు
నరుఁ బవిత్రుఁ జేయ దొరయవెచట. 12

చ. హరిపదపద్మభక్తిరతు లైన మహాత్ములు సర్వకర్మముల్
వెరవున నాచరించి యవి విష్ణుసమర్పణఁ జేసి ధన్యులై
దురితసమూహసంపదల దుర్మదముల్ దలఁగించిమించి దు
ష్కర యమపాశహస్తుల ముఖంబులుసూడరు స్వప్నమందునన్ 13

వ. నరేంద్రా, విష్ణుదూతల యమదూతల సంవాదం బను నొక్క పురాతనోపాఖ్యానంబు వినిపించెద నాకర్ణింపుము. 14

## అజామీళోపాఖ్యానము

మ. పరిఘాతోరణవజ్రగోపురమణిప్రాసాద దేవాలయ
స్థిర కేళీవనదీర్ఘికాగిరులచే శృంగారమై మత్తసిం
ధుర భృత్యాశ్వరథాదిసైన్యములచే దుర్దాంతమై యొప్పు ని
త్యరమాశోభితమైన పట్టణము కన్యాకుబ్జ నామంబునన్. 15

వ. మఱియును, 16

సీ. వేదశాస్త్రపురాణవిద్యాసమేతులై
భాసిల్లుచుండెడి బ్రహ్మవరులు
యుద్ధమధ్యమునసన్నద్ధ శాత్రవకోటిఁ
దేజంబుతోఁ దునుమాడు రాజవరులు
ఘనలాభసంగతక్రయవిక్రయంబుల
వైభవోన్నతులైన వైశ్యవరులు
స్వామిహితైక విశ్రాంతులై తెలివొంది
సుజనమానితులైన శూద్రజనులుఁ

తే. గీ. జతురమతైనట్టి సత్కళాశాస్త్రవిదులుఁ
గవిజనామాత్యభటులును గాయకులును
గలిగి సంపదలకుఁ దానకంబుగాఁగ
ధరణిలోపలఁ జెలువొందుఁ దత్పురంబు. 17

క. సురసంఘంబులు మిక్కిలి
తరితోడుత సందడిలుచుఁ దత్పురి విప్రా
ధ్వరముల హుతభాగంబులఁ
బరితృప్తి వహించు నఖిల పార్థివవినుతా. 18

సీ. భర్మనిర్మితసౌధభాగాగ్రగృహపూర్ణ
వర్ణితమర్దళా ధ్వనులచేతఁ
గేలీవనాంతరక్రీడాసమాసక్త
తరుణకోకిలకూజితములచేత
రాజవీథీచరద్రాజముఖీపద
విమలనూపురనిస్వనములచేత
బంధురామరరాజసింధురప్రతిమాన
చతురమత్తేభఘీంకృతులచేతఁ

తే. గీ. బ్రళయకాలాతి నిబిడదుర్వారతీవ్ర
వాయుఘట్టనసంక్షోభవనధిజనిత
లోలకల్లోల నిర్ఘోషలీల మెఱసి
తఱుమ ముఖరితమై యొప్పుఁ దత్పురంబు. 19

చ. తఱుచుగఁ గీలితంబులగు తత్పురగోపురవైజయంతికా
గురుతరపద్మరాగమణికుంభములందుఁ బయోదసంఘముల్
గిరికొని చిత్రవర్ణ కవికీర్ణములై నయనోత్సవంబుగాఁ
బఱచిన మేలుకట్లక్రియ భాసురలీలఁ దనర్చు నెప్పుడున్. 20

వ. ఇట్లు సకలవైభవాశ్రయంబై సర్వమంగళపరిపూర్ణంబై దివ్య నారీజనాలంకృతంబై నూతన నవపుష్పపరిమళామోదితంబై సకల జననయనానందంబై విలసిల్లునట్టి కన్యాకుబ్జపురంబునందు 21

సీ. తర్కింప వేదశాస్త్రపురాణసహితుండు
సత్యమార్గంబునఁ జనెడువాఁడు
నశాంతమును గృహస్థాశ్రమోపేతుఁడై
సర్వసమత్వంబు జరుపువాఁడు
బంధుమాతాపితృభక్తిసంపన్నుఁడై
సంతతదానప్రశస్తుఁడగుచుఁ
బరకామినీసంగపరిచయరహితుండు
విష్ణుపదధ్యాన విశ్రుతుండు
తే. గీ. ధర నజామిళుఁ డను పేర బరగువాఁడు
భూసురోత్తమతనయుండు పుణ్యమూర్తి
యొక్కనాఁ డల దైవ ప్రయుక్తుఁడగుచుఁ
దండ్రియానతి వడసి సంతసముతోడ. 22

చ. వనమున కేఁగి యావిబుధవర్యకుమారుఁడు వన్యభూజసం
జనితములైన పుష్పఫలజాలములెల్లను సంగ్రహించి ద
ప్పిని బరితాపితుండగుచు బీరముదప్పక నీరుకొంకికై
చని యుదకంబుగ్రోలి యొక చల్లనిచోట సుఖోపవిష్టుఁడై. 23

వ. అయ్యవసరంబున, 24

తే. గీ. ఇరువుగల యొక్కపూఁబొదరింటిలోన
వరవధూయుగ్మదుర్దాంతసురతజనిత
క్రమకంకణఝణఝణత్కారసహిత
మైన మణితంబు విని మది హర్షమంది. 25

క. హృదయంబున మదనాంకుర
మొదవఁగ నవ్విప్రవరుఁడు నున్ముక్తుండై
యిది చూడవలయు ననుచును
ముదమునఁ జనె నానికుంజమునకు నృపాలా! 26

ఆ. వె. సకలవేదశాస్త్రసారజ్ఞులైనట్టి
మునులకైన యోగిజనులకైనఁ

పద్మభవునకైనఁ బవనాత్మజునకైనఁ
గాముబారి మిగులఁ గడువ వశమె. 27

వ. అట్లమ్మహీసురకుమారుండు సత్వరంబుగా సాలగృహంబు సేరం జని యందు నిమేషరహితంబగు దృష్టిసారించి మనంబున నిట్లని వితర్కించె. 28

చ. పురుషుడులేని భామ యెడఁ బుట్టవు నీమణితాదు లిందులోఁ
బురుషవధూముఖాకృతుల పోలికగానఁగఁ రాదు హర్షమున్
వెఱపునుఁ దోషము న్మిగుల వేడుకయున్ హృదయంబులోన సు
స్థిరతవహించి పోనలయు శీఘ్రము మె యింటికి నేమిసేయుదున్ ? 29

వ. అని మనంబున వితర్కించు నాసమయంబున, 30

సీ. సంభోగభాగసంజాతశ్రమంబునఁ
జెమట దేహంబునఁ జెల్మిఁజాఱఁ
గుచకుంభములఁ గెలంకుల నాటనొత్తిన
పచ్చిగోరొత్తులు బయలుపడఁగ
నధరబింబంబుపై నంటిన దంతక్ష
తములు గెంపుల లీల రమణ మెఱయ
వనపుష్పమంజరీవాసితకబరికా
భారంబు ముడి వీడఁ బారి జారఁ

తే. గీ. రూఢ నిశ్వాసజనితమారుతము చేతఁ
దోరమగు నాసికామణి దూలియాడఁ
బ్రేమఁ బెనఁచిన కుసుమాస్త్ర దీమ మనఁగ
వెడలె నచ్చోటువిడిదియొక్క విప్రదాసి. 31

వ. అయ్యవసరంబున నమ్మహీసురకుమారుండు పంచశరజాలపీడితుండై నిజదారాపత్యగృహాదుల మఱచి యధర్మమార్గ ప్రయాణాభిముఖుఁడై. 32

మ. కనియెన్ విప్రకుమారుఁ డచ్చటను రాకాచంద్రబింబాననన్
ఘనమత్తద్విరదారిమధ్యవిలసత్కంజాత పత్రేక్షణన్

వినయోపేతవచోవిలాససహితన్ నీలాలకాలంకృతన్
వనితారత్నము జక్రవాకయుగళీవక్షోజసంభావితన్. 33

వ. ఇట్లు తత్కుమారుండు నూతనంబులగు సంభోగచిహ్నంబులం బరిభ్రమించు తత్కామినీరత్నంబుఁ గదియంజని దేహంబున మదనదాహంబు నిగుడ తన్నయనారవిందసందోహశోభాతతిరస్కరణ చాతురీధురీణంబగు తత్పాదారవిందంబులందునుఁ జేతనంబులఁ దళుకుల మేలాపాదించు తన్నయనవిభ్రమంబులయందును జంభారికుంభికుంభస్థలసౌభాగ్యంబుల ధిక్కరించు తత్కుచంబులందును నిమేషరహితంబగుదృష్టిఁ గీలుకొలిపి చిత్తంబుఁ బరాయత్తంబుఁజేసి దర్శనసుఖపారవశ్యంబున దేహంబు మఱచి కొండొకతడవునకుం దెలిసి యావామలోచన కిట్లనియె. 34

ఉ. ఎవ్వరిదానవే జలరుహేక్షణ నీకును నామ మెద్ది ని
న్నెవ్వఁడు బంపె నిచ్చటి కనేకవిధంబుల దుష్టజంతుకో
టివ్వనమందు జాలఁ గలవేపనిఁ బూనితి వింతలోన నీ
జవ్వనమున్ విలాసమును సౌఖ్యమొనర్చె మదీయదృష్టికిన్. 35

వ. అనిపలికిన భూసురోత్తమునకు నవ్వనితాలలామ యిట్లనియె. 36

తే. గీ. వినుము మునివర్య యేనొక్క విప్రునకును
దాస్యమొనరింతు నాతని దైవికముగ
నొక్కరోగంబు తనువుపై నుద్భవింప
నౌషధార్థంబు వచ్చితి ననఘ యిటకు. 37

క. అని పలికిన దాసికి ని
ట్లనియెం దద్విప్రసుతుడు హర్షోన్నతుఁడై
మనసిజశరపంచక సం
జనితానలతీవ్రతాప సహితుండగుచున్. 38

సీ॥ ముదిత, నేత్రములు నీ ముఖపంకరుహమందు
శ్రుతులు యుష్మద్వాక్య శ్రుతులయందు
బాహువుల్ భవదంగపరిరంభణములందు
ముఖము నీవదనాభిముఖ్యమందుఁ

గరిమలు నీకుచాగ్రస్పర్శసుఖమందు
పాలుపై నజిహ్వాసిన్ బొగడుటందుఁ
బాదయుగ్మంబు నీ భవనాభిగమమందు
చూపచిత్తంబు నీ రూపమందుఁ

తే. గీ. దగిలి యీరీతి మరలింపఁ దరముగాక
హర్ష సంగతమగును నా యంగకములు
బాహ్యసంభోగముల వేడ్కఁబరగునటుల
నింక దయచేసి నను జూడు పంకజాక్షి ! 39

క. సతతము మదనుని శరసం
తతులను దేహంబు మొదలఁ దప్తంబయ్యెన్
బ్రతిలేని సురతసుఖముల
నతిముదమునఁ గారవింపు మంబుజపాణీ ! 40

వ. ఇట్లు మహీసురనందనుండు పలికిన నాశ్చర్యంబంది యవ్వామలో
చన యిట్లనియె. 41

క. ఏవిప్రుని గృహదాసిని
నీవు మహీసురుఁడ వఖిల నీతిజ్ఞుఁడ వి
ట్లీవివరము దలఁపక దు
ర్భావనసేయంగనీకు భావ్యంబగునే. 42

సీ. నిత్యకర్మాదుల నియమంబు విడఁదన్ని
సంధ్యాదికృత్యముల్ జారుపఱచి
తరుచైన పుణ్యతీర్థస్నానవిధ మాని
కులసతిపైనున్న కూర్మివిడిచి
యగ్నిహోత్రాదికృత్యము లన్నియు మఱచి
వేదశాస్త్రాదికవాద మెడలి
జపతపోధ్యానప్రశంస దూరముచేసి
యిహపరాదులమీఁది యిచ్ఛ వదలి

తే. గీ. యశుచియగుపట్టి తనువు నీ వాసఁ జేసి
పొందఁగోరెద వక్కట బాధవ రేణ్య !
శాస్త్రదూషితమైన దుష్కర్మసమితి
నాచరింతురె మీబోంట్లు ఆర్యచరిత ! 43

వ. అనిన దాసికి వసుధామంతనూజుం డిట్లనియె. 44

సీ॥ పరికించిచూచిన బ్రాహ్మణోత్తమునకుఁ
జండాలునకు జన్మసదన మొకటె
యిందందులో భేద మేర్పరింపఁగ రాదు
కర్మమూలంబున ఘనుఁడు ద్విజుఁడు
శౌచకర్మాచార మాచరించినగాని
పరము లేదందురు బ్రహ్మవిదులు
ప్రత్యక్ష దేహసంభావ్యసౌఖ్యముకన్న
దేహాంతరమున నే తెలివిగలదు

తే॥ గీ॥ వసుధ యవ్వనసంపూర్ణ వనిత లెల్లఁ
దోడరి సంసార సౌఖ్య హేతువులుగారె !
పెక్కుమాటలుఁ నిఁక నేలఁ బ్రియముతోడఁ
గారవింపుము నను భక్తిఁ గమలవదన ! 45

ఆ॥ వె॥ సర్వమైనయందుఁ జర్చించిచూడంగ
మనసు దవిలినందె మమత నిలుచు
మమత దగిలినట్టి మానినీరత్నంబు
గవయువాఁడు భాగ్య ఘనుఁడుగాఁడె ! 46

క॥ అదిగాన మదనుశరములు
కదియఁగ నే తెంచెనింకఁ గరుణదలిర్పన్
మదిరాక్షి ! నన్నుఁ గైకొను
మెదిరిన పరిరంభణముల నీ వనపీథిన్. 47

వ॥ అని భూసురతనయుండు మదనవేదనాపీడితుండై పలికిన సాత్త్విక
పూర్వకంబులైన వచనంబుల కొడబడిన నాచేడియం దగిలి కన్యా

కుబ్జపురంబున కరుగుదెంచి జాత్యసంకరమైన తల్లి దండ్రులం బరిత్య
జించి కులకాంతను విసర్జించి యాదాసియం దనవరతంబును సురత
క్రీడాసమాసక్తుండై చౌర్యమాయాద్యూతపానాదివ్యసనంబులం
దగిలియుండి కుటుంబభరణంబు సేయుచుఁ గొండొకవత్సరంబులకు 48

ఆ. వె. ఆ యజామిళుండు హర్షంబు రెట్టింప
దాసియందు వరుసఁ దనయువరుల
బదురఁగాంచి యందుఁ దుదసంభవించిన
కొడుకు మీఁది కూర్మి మిగుల మెఱయ. 49

క. నారాయణుఁ డన వానికిఁ
బేరిడి సంతసముతోడఁ బిలుచుచు నెప్పుడున్
నోరికి పాఠము సేసెను
నారాయణుఁ డనెడి విష్ణు నామాంకంబున్. 50

క. నడచిన నలసిన సొలసిన
నుడుగక యెచ్చోటనైన నుండినఁ గలలన్
గొడుకును నారాయణ యని
నుడువుచు వానియెడఁ గూర్మి నూల్కొలిపె నృపా! 51

వ. అంత నజామిళునకుఁ బాతకంబువలన నాయుష్యంబు దినదినం
బునకుఁ దరిగి మృత్యువాసన్నంబైన సమయంబున ఘోరాకారు
లైన యమకింకరులు పాశహస్తులై యతనియెదుట నిల్చి యున్న
సమయంబున, 52

క. నారాయణుఁ డను తనయునిఁ
గారవమునఁ జీరి చీరి కంఠగతుండై
యూరూఢి తనువువిడిచెను
మీఁజ యజామిళుఁడప్పుడు మేదిని మీఁదన్. 53

విష్ణుదూతల యమదూతల సంవాదము

తే. గీ. తనువు విడువ విప్రదాసీవిభుని వానిఁ
డొడరి కట్టి యముని దూత లపుడు

దండపాణు లగుచు దర్పించి చను నంత
విష్ణుదూత లెఱిఁగి విస్మయమున. 54

వ. ఇట్లు దివ్యతేజులును జక్రగదాశార్ఙ్గధరులును, బద్ధాక్షమాలా
విభూషితులును, బుండరీకవిశాలనయనులును, దివ్యతేజోవిరాజితు
లును, బీతాంబరాలంకృతులును, నైన విష్ణుదూత లతిసంభ్రమం
బున నేతెంచి యమదూతలం బరాజయంబు నొందించి శ్రీహరి
మనాస్మరణప్రభావంబున గతకల్మషుండగు నజామిళుని విడిపించు
కొనిన, గృతాంతకింకరులు భయావృతమనస్కులై యాదివ్యపురు
షులతో నిట్లనిరి. 55

సీ॥ శంఖచక్రగదాసి శార్ఙ్గాదిదివ్యాయు
ధంబులు ధరియించి దర్పమెసఁగ
నేతెంచినారు మీ రెవ్వరు ఘనమైన
బలపరాక్రమములఁ బ్రబలినారు
దుఃఖాకరంబులై దురవగాహము లైన
బహువిధ నరకకూపములయందు
దండింపఁదగిన యీధరణీసురాధముఁ
గొనిపోవు చున్నారు కొదువ లేక

తే. గీ. ధరణిలోపలఁ బాపతత్పరుల నెల్ల
దండనముచేయు నధిపతి దండధరుఁడు
విడువుఁ డీఁక మీరు గొనిపోక వీని నిపుడ
యనిన యమకింకరులకు ని ట్లనిరి వారు. 56

క. హరిభక్తితోడ వెలసిన
పురుషుల వైకుంఠపురముఁ బొందించుటకై
తిరుగుదుము జగములోపలఁ
బరబలసంహరణచతురబలసహితులమై. 57

చ. తనయ మిషంబుతో నితఁడ ధర్మము సేయుచునైనఁ బుండరీ
కనయను నామకీర్తనముఁ గైకొని మానక చేసెగాన నీ

మనుజుఁడు రత్ననిర్మితవిమానముఖంబున దివ్యకామినీ
జనములు గొల్వఁ జేరు నతి సౌఖ్యముతోఁ దుత విష్ణులోకముల్. 58

క. హరిపదసేవాకరుఁడై
హరిగుణములు నుడువ నేర్చి హర్షోన్నతుఁడై
హరిభక్తి గలుగు నరులకుఁ
బరువునఁ జెడిపోవు నెట్టి పాతకమైనన్. 59

ఆ. వె. దండధరుఁడు కర్త ధర్మంబులకు నెల్లఁ
నట్టిధర్మమెఱిఁగి నట్టిమీఱ
లిది యధర్మ మనుచు నిది ధర్మమనుచును
విస్తరింపవలయు విభజనముగ. 60

వ. ఇట్లు పలికిన విష్ణుదూతలకు సంవర్తకింకరు లిట్లనిరి. 61

సీ. వేదంబు లెల్ల శ్రీవిభుని రూపముగానఁ
దత్కథితార్థంబు ధర్మసరణి
తద్విధగోచరార్థ వ్యతిక్రమ రూప
మది యధర్మం బన నాశ్రయంబు
నాకాశచంద్రవాయ్వగ్నిభానురులును
జలభూయమాదులు సాక్షి గాఁగ
బుణ్యానంతులు బుద్ధిపూర్వకంబుగ ధర్మ
మాచరింతురు ముక్తికరుగుచుందు

తే. గీ. రంత నజ్ఞానమోహితులైన నరులు
సంతతాధర్మ నిరతులై సమసి మీఁద
యాతనాదేహముల ఘోర వాదులందు
దుఃఖములఁ బొందుచుందు రద్భుతము మెఱయ. 62

వ. మఱియు దుష్కర్మంబులు చేసిన పాపాత్ములు దండనీయులు. సత్కర్మంబులు చేసిన పుణ్యాత్ములు మాననీయులై యుందు రిట్లు ధర్మాధర్మంబు లాచరించి దేహాంతరగతుండైన జీవుండు భోగ్యంబులైన స్వర్గనరకంబులందు సుఖదుఃఖంబు లనుభవించి

తుదఁ గర్మపరివిష్టంబులైన గర్భంబులఁ బ్రవేశించి తత్ఫలంబు లనుభవించు నాయనుభవంబు సంసారరూపంబైన పుత్రమిత్రకళత్రాదిశరీరమాత్రింబందు సంయుక్తంబైన యది సుఖం బనం బరఁగు. నిట్లాద్యంతంబై పరివర్తించు సంసారంబు ననుతాపంబునం జనెడివానికి నిజమార్గంబు దూరంబైనఁ దరుచ్ఛాయయందు నిలువం బడెడు మనోరథంబు సంభవించు మాడ్కి గ్రమంబునఁగాఁగల సుఖంబుల యందు వాంఛ సంభవించు, నావాంఛ దేహపతనపర్యంతంబుఁ జెడక నిల్చు, నది పూర్వకర్మపరిపాకంబునం గాని ఫలితంబు గాదు. దేహికర్మంబు లాచరింపుచుఁ దత్ఫలం బంగీకరించి బహువిధంబులగు సంసారరూపంబులం బడి వెడలు మార్గంబు తెలియలేక జన్మాద్యంత భయంబులం బొందుచుఁ బ్రేరితుండై పాపపుణ్యంబు లాచరింపుచుండ దండధరుండు నవి వేఱుపఱచి దండింపందగు వారిని దండించు నది గావున నీయజామిళుం డొక్కనాఁడు సమిత్కుశఫలపుష్పార్థంబు వనంబున కరిగి, యచట నొక విప్రదాసిం గని మనంబు నియమింప శక్తుండు గాక నిజకాంతంబరిత్యజించి తద్గతస్వాంతుండై చౌర్యద్యూతాదివ్యసనంబులం దగిలి యాదాసియందు సంతానంబు వడసిన నతండు దండనీయుం డని యమునిసమ్ముఖంబునకుఁ గొనిపోవు వార మని యమదూతలు పలికిన విని విష్ణుదూత లిట్లనిరి. 63

సీ. ధర్మవేదులు మీరు ధన్యులే కాని పు
ణ్యులఁబట్టి దండింపు చున్నవారు
తల్లిదండ్రుల నిజాప్తకుమారులం జంపఁ
గదియంగ మాన్పఁగాఁ గలరె యొరులు
పుణ్యవంతులు బుద్ధిపూర్వకంబుగ ధర్మ
మాచరించిన జగంబట్టి సనును
నిలిచి ధర్మాధర్మములు నెఱుంగని వాఁడె
పరుచుతిరిగెడి గ్రామ్యపశువుగాఁడె

తే. గీ. తత్త్వమున మీ రెఱుంగని ధర్మ మేది
కోటిజన్మార్జితాఘ సంకలితుఁడైన
ప్రాఁతకాలాన హరినామపఠనఁ జేసెఁ
గాన పుణ్యాత్ముఁ డయ్యె నిమ్మానవుండు. 64

క. వ్రతములు ననుకులాచార
క్రతువుల దానములనైనఁ గలుగదు లక్ష్మీ
పతిలోకవిహితసౌఖ్యము
సతతము శ్రీవిష్ణునామ జపరహితునకున్. 65

తే. గీ. సంతతాచారదానయజ్ఞముల భక్తి
నాచరింపఁగనే ఫలం బతిశయిల్లుఁ
బ్రాతకాలమున హరినామ పఠనసేయు
ధర్మపరులకుఁ గలుగుభో తత్ఫలంబు. 66

క. పరిహాసంబున నైనను
హరినామస్మరణసేయు నట్టిమహాత్మున్
దురితంబులు సెందక శ్రీ
వరు పథమున నిలుతు రధికపై భవయుతులై. 67

వ. అదిగాన మీరలు వైష్ణవసేవానిరతులైన మహాత్మలం గనుంగొనిన యప్పుడే తొలంగవలయు నని వివేకవాక్యంబులు పలికిన విస్మయంబంది సమవర్తికింకరులు తద్విష్ణుకింకరుల కరంబుల నజామిళుని బలాత్కారంబునఁ గొనిపోవ నలవిగాక నతిత్వరితంబున యమసన్నిధి కరిగిరి. విష్ణుదూతలు నయ్యజామిళునిం గనుంగొని యిట్లనిరి. 68

ఆ. వె. దురితచయము వలనఁ దరిగిన భవదాయు,
వందులోన శేష మనుభవించి
యంతమీఁదఁ బుష్పకాంతరగతుఁడవై
చక్రిభవనమునకుఁ జనుము విప్ర. 69

క. ఆయువు శేషించినచోఁ
బాయక జననంబు వసుధఁ బ్రాప్తం బగు నఁ
య్యాయువు పూర్ణంబుగ ధృతి
నాయతపుణ్యమున జీవుఁ డరుగు మహాత్మా. 70

వ. అని భూసురునకు దద్వృత్తం బంతయు నెఱింగించి విష్ణుకింకరులంత
ర్ధానంబు నొంది రంత నజామిళుండును నిజాయుశ్శేషం బనుభవిం
చుటకు విసృష్టంబగు నాత్మశరీరంబుఁ బరిగ్రహించి పశ్చాత్తాపం
బున దాసీసంగమంబు రోసి పుత్రదారాధనాప్తపశుగతదుర్మో
హంబు విసర్జించి గంగాకూలంబున కరిగి. 71

క. చిత్తంబున హరిరూపం
బత్తుకొనం జేసి తద్గుణావలు లెపుడున్
దత్తరమున నొడువుచు దు
ర్వృత్తి విసర్జించి తత్త్వవిద్యాపరుఁడై, 72

సీ. అఖిలజగద్రూపమై వెలుంగుచు నున్న
హరియె దైవం బని యాత్మఁ దలఁచు
బహువిధమృగమత్స్యపక్షికీటాదుల
విష్ణురూపములుగా వీక్షసేయు
సంతతధ్యానపరిశాంతుఁడై యొకవేళ
హర్షితుం డగుచు బాహ్యంబు మఱచు
త్రికరణశుద్ధుఁడై తెలిసి నాలుకతుద
మఱువక విష్ణునామములు నుడువు

తే. గీ. భక్తితో నిట్లు శ్రీవిష్ణుభక్తుఁ డగుచు
నయ్యజామిళుఁ డింద్రాదు లాత్మఁ బొగడ
గాల మీరీతిఁ గడుపుచు లీలతోడఁ
దత్పదధ్యాన విమలుఁడై తనువు విడిచె. 73

ఉ. ఆహరిభక్తుఁ డంత మదనాభినవాకృతిఁ దాల్చి దేవసం
దోహము గొల్వ దండధరదూతలు విస్మయమందఁ బుష్పకా

రోహణమాచరించి మహీరోచులు దిక్కుల నుల్లసిల్ల స
న్నాహముతోడ విష్ణుసదనంబున కేఁగె మహానుభావుఁడై. 74

వ. అని వ్యాసతనూజుం డిట్లు సవిస్తరంబుగా నజామిళుని వృత్తాం
తం బెఱింగించిన విస్మయంబంది మహీకాంతుం డిట్లనియె. 75

క. యమదూతలు హరిదూతలు
దమలో వివదించి కలసి తన్మార్గమునన్
యమదూత లెచటి కరిగిరి
విమలగుణోద్ధార నాకు వినరింపఁగదే. 76

చ. అనిన మునీంద్రుఁ డిట్లనియె నానృపపుంగవుతోడ సత్యవా
క్యనయగుణాభిసన్నుత, కృతాంతుని కింకరు లంత నాత్మనా
థుని కడ కేఁగి చిత్తమునఁ దొట్టిన భీతిని గంపితాంగులై
మునుకొని హస్తకంజముల మోడ్చి రయంబున దాసి మొత్తమై77

సీ. అధిప! కృతాంత! నీయాజ్ఞావశంబున
సకలభూతల మెల్ల సంచరించి
నవకమైతనరు కన్యాకుబ్జపుర మనఁ
గలదు పట్టణము విఖ్యాతిఁ మెఱసి
సరవి నాపురిలో నజామిళుఁ డను నొక్క
భూసురతనయు డద్భుతచరితుఁ,
డతఁ డాత్మసతిఁ బరిత్యాగము చేసి దా
సీపతిత్వమునొంది సిగ్గువిడిచి

తే. గీ. జాతిధర్మంబు విడనాడి సత్య ముడిగి
తనకులంబునఁ గలుగు బాంధవులు సర్వ
శౌర్యసాహసవిద్యాదిసహితుఁ డగుచుఁ
దనయులం గాంచె వేడ్కతో దాసియందు. 78

క. ఆరూఢపతితుఁ డగు వా
డారూఢిని నిజతనూజులం దొక సుతునిన్

నారాయణుఁ డను పేరిడి
గారవమున వానిఁ జీరుఁ గరుణదలిర్పన్. 79

క. నారాయణుఁ డను సుతుపైఁ
గూరిమిఁ దలకొల్పి వానిఁ గొనకొని యెపుడున్
నారాయణ నారాయణ
నారాయణ యనుచుఁ జీరు నయమొప్పంగన్. 80

వ. ఇట్లు పుత్రదారాగృహాదిదుర్మోహసహితుండగు నయ్యజామిళుండు పాపంబులవలన నాయుఃక్షీణుండై యపమృత్యుముఖంబునఁ బంచత్వంబునొందిన నేమద్విజాధముని గొనివచ్చు నెడఁ జతుర్భుజులును శంఖచక్రగదాధరులును పీతాంబరాలంకృతులును దివ్యతేజోవిరాజితులును, రత్నభూషణభూషితాంగులును, సర్వలక్షణపరిపూర్ణులునైన పరమపురుషు లెదిర్చి బలాత్కారంబున మదీయకరంబుల వలన బహుకలుషసమేతుం డగు తన్మహీసురుని విడిపించుకొని చనిరని విన్నవించిన వారలకు వైవస్వతుం డిట్లనియె 81

సీ. వినుఁడు కింకరులార వేదాంతవేద్యుండు
విష్ణుండనా నాదివేల్పు గలఁడు
అతఁ డాత్మమాయా బలాఢ్యుఁడై త్రిజగంబుఁ
బుట్టించు రక్షించుఁ బొడ వడంచు
నతని యానతిఁ జేసి యంబుజోద్భవరుద్ర
దివిజాధిపతు లెల్లఁ దిరుగుచుందు
రంబర సర్వంసహాగ్ని వాయు జలాది
తత్త్వరూపంబునఁ దనరుచుండు
తే. గీ. నెందుఁ బరికించి చూచిన నందె కలిగి
నెగడు దుర్మార్గవర్తులఁ దెగడు పరచి
స్థావరంబును జంగమాత్మకము నయిన
జగము పాలించు నాదేవచక్రవర్తి. 82

క. ఆవిష్ణుఁడు జగదీశ్వరుఁ
డా విష్ణుఁడు యోగిమానసాంబుజనిలయుం
డా విష్ణుఁడె పరతత్త్వం
బా విష్ణుఁడె వేదవేద్యుఁ డాత్మఁ దలంపన్ 83

క. హృత్కమలంబున విష్ణుని
సత్కారముతోడఁ దలఁచు సంస్తుత్యులకున్
దైత్కైటభఘనరాక్షస
జిత్కమనీయాలయంబుఁ జేకొనుఁ దిరమై. 84

క. పరిహాసంబుననైనను
హరినామస్మరణ సేయు నట్టి మహాత్ముల్
దురితములఁ బాసి పొందుదు
దిరవగువైకుంఠపురము నెనసిన వేడ్కన్. 85

చ. పతితుఁడు దుశ్చరాన్వితుఁ డపాత్రుఁడు దండ్యుఁడునన్యకామినీ
రతుఁడు సువర్ణహర్తయును బ్రాహ్మణహంతయునైన మానవుం
డతులితవిష్ణుభక్తి యుతుఁడై హరినామముఁ బల్కెనేని య
చ్యుతనిలయంబు జెందు నతి శోభితుఁడై యతఁ డింద్రసేవ్యుఁడై 86

క. అజ్ఞానంబుననైనను
విజ్ఞానముతోడ నైన విష్ణునిగుణముల్
ప్రాజ్ఞతఁ బొగడిన నరుఁడు మ
దాజ్ఞకు భయపడక నరుగు హరిపురమునకున్ 87

వ. మరియు మహేంద్రుండును నేనును నిరృతియును, వరుణుండును, గళానాథుండును, నగ్నియు, నీశుండును, బవనుండును, సూర్యుండును, గమలసంభవుండును, విశ్వేదేవతలును, వసురుద్రాదిత్యులును, దేవగణంబులును, భృగ్వాదిమునిగణంబులును, దద్విష్ణుని యథార్థస్వరూపం బెఱుంగ లేము. తద్గుణంబులు వర్ణింపను మనోగోచరంబులు గావు. అట్టి పరమపురుషుని కింకరులు విష్ణుభక్తి సమేతు లగువారిని బరమపదంబు నొందించుటకునై తత్పుండరీ

కాకరూపస్వభావంబులు ధరియించి గుప్తాకారంబుల జగంబుల సంచారంబు సేయుదురు మఱియు భగవత్ప్రీతధర్మంబులను బ్రహ్మయు, నారదుండును, గిరిశుండును, కుమారస్వామియుఁ, గపిలుండును, వైవస్వతుండును, బ్రహ్లాదుండునుఁ బలియు, జనకుండును, భీష్ముండును, వ్యాసతనూభవుం డెఱుంగుదురు. గాని తక్కిన వార లెఱుంగ లేరు. భక్తియోగసమేతులగు వారలకు భగవన్నామమంత్రోచ్చారణమాత్రంబునఁ బరమపదంబు గలుగు నని సమవర్తి చెప్పి మఱియు నిట్లనియె. 88

శా. మీకీతత్వ మెఱుంగఁ జెప్పెద నజా మీఘుండు పాపప్రధా
నాకారంబు ధరించియున్ నిజసుత వ్యాజంబునం జేసి ల
క్ష్మీకాంతాప్రియ నామవర్ణములు వక్కాణగాన వాడంత్యమం
దాకంజాక్షు పురంబు నొందు గతపాపానీకుఁడై వేడుకన్ 89

క. భూవలయంబున నరులకు
భావతనూవచనజనితపాపము లడఁపన్
శ్రీవిభుని నామకీర్తన
తావన్మాత్రంబు చాలుఁ దలపోయంగన్ 90

క. పాయక తగిలిన సంసా
రాయాసమె సౌఖ్యమనుచు ననయము మనుజుల్
మాయామోహితులై హరి
సాయుజ్యముఁ బొందలేరు సన్మార్గమునన్. 91

క. అదిగాన వైష్ణవంబునఁ
బదిలుండై తిరుగునట్టి పావనుఁడు భయా
స్పదమగు మద్దండాహతి
నదరకచను నమరసేవ్యుఁడై హరిపురికిన్ 92

గీ. హరిగదాభిగుప్తులై యెల్లకాలంబు
సర్వసమతఁ బొందు సౌమ్యమతుల
దండనంబు సేయఁ దలకును మత్పాణి
దండమధికభీతిఁ దల్లడిలుచుఁ. 93

ఉ. ఇంతటినుండి మీఁదికిఁ మహీవలయంబున కేఁగి దుష్కృతా
క్రాంతశరీరసంయుతులఁ గంజదళాక్షపదాంబుజద్వయా
భ్యంతరపుణ్యరేణువిముఖాత్ముల గౌరవబంధచిత్తులన్
బంతముతోడఁ దెండు హరిభక్తులఁ జేరఁగఁ బోకుఁ డెన్నఁడున్. 94

చ. శిరమున విష్ణు వందనముసేయని వారల నాత్మలోపలన్
హరిఁ దలపంగ నేరని నరాధములన్ మది నమ్మి జిహ్వలన్
గిరికొని భక్తినామగుణ కీర్తనముల్ విడనాడు క్రూరులన్
బరువునఁ బట్టి తెండిటకు భాసురపుణ్యము లెన్ని గల్గినన్. 95

సీ. కేలిమై హరినామకీర్తనామృతపాన
మత్తులై దిరుగాడు మనుజవరుల
హృత్పద్మమందు లక్ష్మీశుపదధ్యాన
నిరతులై వర్తించు నియమమతుల
కమలనాభప్రీతిగా మహీసురులకు
దానంబు లొసగెడి ధర్మపరుల
భువన మంతయుఁ జతుర్భుజునిరూపం బని
తలఁపనేర్చిన మహాతత్త్వవిదుల
తే. గీ. నొక్కనాఁ డైన హరివాసరోపవాస
సహితు లైనట్టి సంతతాచారపరుల
నతిథిపూజాసమేతులైనట్టివారి
దూరమునఁ జూచినంతనె తొలఁగ వలయు. 96

గీ. ఆత్మభక్తిసహితు లగువారి దుష్కర్మ
మడఁప నేర్చినట్టి హరిఁ బరేశు
నాదిపురుషునకును నవ్యయుఁ బరమార్థ
విభవు దలఁతు మిగుల వేడ్కతోడ. 97

వ. అని పలికి సమవర్తి నిజకరంబులు శిరంబునం గీలుగొలిపి పుండరీ
కాక్షుని దలంచి. 98

క. సతతంబును శ్రీవనితా
పతి యగు జగదీశ్వరుండు భక్తులయెడ మ

తత్కృతమగు నపరాధాయుత
శతములను సహించుఁగాక సంరంభమునన్ 99

వ. ఇట్లు శమనుండు కింకరుల కాజ్ఞాపించిన వృత్తాంతంబు వినిపించి
వైయ్యాసి యిట్లనియె. 100

క. అదిగాన విష్ణుకీర్తన
విదితజగన్మంగళాదివిశ్రామగృహం
బెదిరిన కలుషానీక
చ్ఛిదమతిరమ్యంబు వీక్షసేయగనధిపా. 101

క. అలయక లక్ష్మీశ్వరుగుణ
ములు వీనుల వినినవైన మోదము తోడం
బలికిన నైన ను నరులకుఁ
గలుగును నిర్వాణసుఖము కౌరవనాథా 102

గీ. ప్రస్తుతింప విష్ణుభక్తిచేహృదయంబు
శుద్ధిబొందినట్లు సారదిసేయు
సంతతవ్రతాది సత్కర్మములచేత
నాత్మశుద్ధి గలుగ దనఘచరిత. 103

చ. హరిపదపద్మషట్చరణుఁడైన నరుండు విస్మృష్టుఁడయ్యు దు
స్తరనృజినావహంబు లనఁ జాలిన మాయగుణంబులందు సం
చరణమొనర్ప నన్యుఁ డవి చారితకామహితాంతరంబగుఁడై
దురితచయంబుగీటడప ధుర్యుఁడుగాఁ డతఁ డెన్ని చూచినన్. 104

చ. అదిమొద లాపరేతపతి యానతిఁ జేశి తదీయకింకరుల్
వదలని సాధ్వసంబున నవారితవిష్ణుపదాబ్జభక్తిచే
బొదలెడి వారి మార్గముల బోవక సంచరణంబు వేడ్కఁ జే
యుదురు జగత్త్రయంబున నహోభక్తి సముజ్జ్వలితాంతరంగులై

క. అతులితహరిచందనప
ర్వతమున నాసీనుఁ డగుచు వర్ణిత మగు ని

య్యితిహాసము చెప్పెను నా
కలిముదమున కుంభజుండు హర్షంబొదవన్. 106

వ. అని యిట్లు చెప్పిన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె. 107

క. దివిజాసురఖగమృగమా
నవపన్నగశైలభూవనద్రుమముల సం
భవ మెల్ల వింటి నిఁక నను
భవస్వర్గణము వినగవలయు భవగుణరహితా. 108

వ. అనిన శుకుం డిట్లనియె. 109

ప్రచేతసులకుఁ జంద్రుండు కోపనివారణ సేయుట

సీ. ఎలమిఁ బ్రాచీనబర్హిర్నామములఁ బొంది
వసుహాత్మజులు వార్ధివలననుండి
వదురు సంభవ మొంది పాద ప్రోజ్జ్వల మైన
వసుధాతలం బెల్ల వరుసఁ జూచి
వారు రోషావేశపూరితనయను లై
యాననముల మారుతానలములు
పుట్టించి తద్వృక్షముల దహింపుచు నున్న
యవసరంబున చంద్రుఁ డరుగుదెంచి
గీ. యమృతరూప మైన యతిసాంత్వనోజ్జ్వల,
వాక్యసరణిచేత వారి హృదయ
జనితకోపవహ్ని చల్లార్చి ముదమునఁ
బలికె నిట్లు జగము ప్రస్తుతింప. 110

సీ. సర్వేశ్వరుఁడు వనౌషధుల నాది సృజించె
నన్నార్థ మఖిలజీవావలులకుఁ
దన్నిమిత్తము భవత్ప్రపితామహాదులు
వీని భావింతురు వేడ్కతోడఁ

సాంతత్యముగఁ బ్రజాసర్గంబుకొఱకు మీ
రాజ్ఞప్తు లైనవా రనఘులార
స్థావరజంగమాత్మకరూపములయందుఁ
దెలివొందు సాక్షియై జలజనాభుఁ

గీ. డట్లు గావున నాభూరుహముల నెల్లఁ
హింససేయక ఘనరోష మేపడంచి
భూజసంజాత యైన యాంపూవుబోణి
నేలవలయును భార్యగా నేపు మిగిలి. 111

దక్షోత్పత్తి దక్షుండు ప్రజాసర్గంబొనర్చుట

వ. అని చంద్రుండు సాంత్వనవచనముల బ్రచేతసులం రోషంబు మాన్పి వృక్షసంరక్షణంబు చేసి యావృక్షసంభవ యగు కన్యకారత్నంబు నందుఁ బ్రజానిర్మాణచాతురీసమేతుం డైన దక్షప్రజాపతిం బుట్టించిన నతండు తపోమహాత్మ్యంబున మనోమార్గంబున దేవాసుర మనుష్యగంధర్వాదులను జలస్థలనియమంబు లైన జంతువ్రాతంబుల సృజియించిన నవి బహుప్రకారంబుల వృద్ధిపొందక నమసి పోయినం జూచి యమ్మహాత్ముండు వికలితాంతరంగుండై యుద న్మార్గంబునం జని వింధ్యపర్వతప్రాంతంబున నఘమర్షణతీర్థంబునఁ దపంబు సేయుచు లక్ష్మీకాంతుని నిట్లు స్తుతియించె, 112

దక్షుండు శ్రీహరినిగూర్చి తపంబొనర్చుట

చ. పరమపరాత్మమూర్తినిగృపాలుని భక్తజనైకసేవ్యునిన్
పరమమునీంద్రయోగిజన భావసరోరుహమధ్యవర్తి ను
త్కరరిపుగర్వభంజనునిఁ గంజదళాక్షుని సర్వపూర్ణునిన్
హరిగమలాధినాయకుని నాత్మఁ దలంచెద నెల్లకాలమున్. 113

మ. తిలలన్ తైలము సంక్రమించుకరణిన్ తేజంబు భూజంబులన్
గలుగుంభాతి గుణంబు ద్రవ్యయుతమై గాన్పించుచందంబునన్
దెలియన్ విశ్వమయుండవై వెలయు నీ దివ్యస్వరూపంబు ని
శ్చలభక్తిన్ వినుతింతుఁ గొల్తు ధరణీశా దేవచూడామణీ!. 114

సీ. దీపించుచును మనోరూపంబు గైకొని
సకలజీవులయందు సంక్రమించి
లోచనంబులకు నాలోకంబు రసనకు
రసవివేకంబును ఘ్రాణమునకు
గంధంబు శ్రోత్రియాంగమునకు శబ్దంబు
చర్మంబునకును సంస్పర్శసుఖము
కరములకును గర్మకౌశలంబును బాద
ములకును గతియు నై మోద మలరి.

గీ. జగముఁ బుట్టింప రక్షింప సమయఁ జేయఁ
గర్తవై నీవు జనులందు గరిమ మెఱసి
బ్రహ్మరుద్రాదిసురులెల్లఁ బ్రస్తుతింప
మాయఁదిరుగుదు వీరీతి మదనజనక. 115

చ. ఇనుఁడును బద్మవైరియు మహేంద్రుఁడు నారదుఁ డాత్మసంభవుం
డును భుజగాధినాథుఁడు మృడుండును వ్యాసుఁడు జాంబవంతుఁడుం
సనకసనందనాదులును సంతతముం భవదీయ మైనమా
యను దరియింప లేక తిరుగాడుదు రెయ్యెడ నంబుజోదరా ! 116

స్రగ్ధర. సారాచారావిచారా జగదవనపరా సచ్చిదానందరూపా
ఘోరానేకామరద్విట్కులదళనరతా కోటిభానుప్రకాశా
శ్రీరత్నోదారవక్షస్థితకనకమయాశేషభూషావిశేషా
భూరామాధీశ మిమ్మెప్పుడుఁ దలఁతు దయాపూర్ణరాజ
త్కటాక్షా. 117

ఉ. అధ్యయనంబు చేసి చరితార్థము నెల్ల యెఱింగి యాత్మలో
విద్యపయుక్తకర్మపదవిం జనువారికిఁ గాని యాత్మలో
సాధ్యముగాదు ముక్తి గుణసాగర నిన్ గొనియాడినంత నా
రాధ్య భవన్నివేశము తిరంబుగఁ గల్గును భక్తికోటికిన్ 118

మత్త. నారదాదిమునీంద్రవందిత నవ్యపాదసరోరుహా
ఘోరదానవదర్పనాశన కోటిమన్మథసన్నిభా

భూరమాధిపకౌస్తుభప్రియ భూషణాభివిరాజితా
చారువైభవ భక్తవత్సల శంఖచక్రసముజ్జ్వలా. 119

దక్షునకు శ్రీమన్నారాయణమూర్తి ప్రత్యక్షంబగుట

ఉ. దక్షిణబాహుదండమునఁ దాల్చిన చక్రము తేజరిల్లఁగా
పక్షిజగద్విభుండు సులభంబగువాహనమై చెలంగ స
ద్రక్షణ చేయఁబూనిన విరాజితమూర్తి ధరించి నాకుఁ బ్ర
త్యక్షము గమ్ము దైత్యకులదర్పనివారక మాధవాచ్యుతా. 120

దక్షునకు పరమేశ్వరుఁడు ప్రత్యక్షంబగుట

వ. ఇట్లు బహుప్రకారంబుల సన్నుతించు సమయంబున గరుడవాహ
నారూఢుండును, దివ్యాంబరాలంకృతుండును, ప్రలంబాష్టభుజ
గృహీతశంఖచక్ర, ఖడ్గ, చర్మ, బాణ, కోదండ, పాశ, గదా
సమేతుండును, నీలనీరదసమానశ్యామలదేహుండును, ప్రసన్న
వదనుండును, వనమాలికావిభూషితుండును, శ్రీవత్సవక్షకౌస్తు
భాంకితుండును, రత్నకిరీటకుండలహారకటకాంగుళీయవలయనూపు
రాంగదసముజ్జ్వలుండును, త్రైలోక్యమోహనాకారుండును నై స
లక్ష్మీవల్లభుండు నారదాదిదివ్యమునిసమేతుండై శక్రగంధర్వా
దులు ప్రస్తుతింప నఘమర్షణతీర్థంబునఁ బ్రత్యక్షంబై నయంత
నవలోకించి దక్షప్రజాపతినయనానందకందంబగు తద్రూపంబు మనం
బునఁ గీలుకొల్పి సాష్టాంగదండప్రణామంబాచరించిన నతనికిఁ
బుండరీకాక్షుం డిట్లనియె. 121

క. ప్రాచేతస విను మిచ్చట
నీచేశినతపమునకును నే మెచ్చితి నా
నీచేతనె స్సేయుము వసు
ధాచక్రము నెల్ల సంతతప్రియచరితా. 122

సీ. ధర్మంబుసురలును ధాత్రినిలింపులు
భూతలంబగ్నియుఁ బుణ్యనదులు

వాయువాకసమును వనధులు భూనుండు
సద్గ్రహతారలు జ్ఞానపదము
నాశ్రమంబులు కాననాంతరములు వేద
సంఘముల్ పశువులు సప్తమునులు
మొదలుగాఁగలుగు నీ విదితప్రపంచంబు
రూఢిగా వెలయు మదూర్పమగుచు

గీ. అధికమద్వీర్య బృంహితుండగుచు వేడ్కఁ
దత్ప్రపంచంబుఁ బుట్టింపధాతవాఁడమె
నతఁడు సృజియించె మిమ్ము విశ్వాదిసర్గ
చతురసాధనసంపత్తిసహితమతుల. 123

గీ. వారిలోననీవు వర్ణింపఁదగినట్టి
బుద్ధినేర్పులందుఁ బోలుపుమిగిలి
సకలవిద్యలందు సర్వజ్ఞతనుమించి
నాఁడవనఘ సత్యనయవిశాల. 124

వ. మత్కటాక్షవిశేషంబున జగంబులనంతంబై పూర్వంబున నుత్పాదితంబులయ్యె నందుఁ బ్రజాసర్గంబునకు నిర్మాణప్రకారంబులు బహువిధంబులై ప్రవర్తించుఁ దత్ప్రకారంబులయందు- 125

సీ. జగములోపల బ్రజాసర్గంబు విధమెల్ల
వివరించి చెప్పెద వినఁగవలయుఁ
బంచజనాంగసంభవ యాతలోదరి
ప్రేమనశక్ని నా పేరుగలది
యాకాంత పత్నిగా నేలి వేడుకతోడ
సంభోగభోగంబు సలుపునపుడుఁ
విదితంబుగా భవద్వీర్యంబు తద్గర్భ
జలజంబులోపల సంక్రమించి

గీ. పుత్రసంతానరూపమై పొలుపు మిగుల
నందుమూలమున సృష్టివిఖ్యాతిబొదలు

ననుచు దక్షునికిట్టివృత్తాంతమెల్ల
దెలిపిచనియెను తద్రమాధిపుఁడనంత. 126

హర్యశ్వబలాశ్వల జననము

వ. ఇట్లు తెలిపి లక్ష్మీకాంతుండంతర్ధానంబునొందిన దక్షప్రజాపతి తదాజ్ఞ నంగీకరించి విష్ణుమాయోపబృంహితుండై పంచజనితనూభవయగునశిక్నిం బెండ్లియాడి యకాంతయందు హర్యశ్వులను కుమారులంగాంచిన వారలునుసర్వగుణసమేతులై ప్రజాసర్గంబు కొరకు జనకనియుక్తులై వరుణదిగ్భాగంబునకుంజని- 127

మహాస్రగ్ధర. కనిరాహర్యశ్వులంభఃకణసహితమరుత్కంపితాకీర్ణభూజాగ్రనవానేకప్రసూనగ్రథితమధుకరాక్రాంతపుష్పాసవాంత
ర్జనితామోదాభిగుప్తచ్ఛదకమలవనచ్ఛాయసంక్రాంత పానీయనితాంతాపూర్ణనారాయణవిమలసరఃప్రాంతసౌవర్ణ
భూమిన్. 128

క. ఆనారాయణతీర్థము
లోనన్ దపమాచరించులోకోత్తరు లే
దానంబు లేక వాంఛిత
మైనపదార్థములఁ గేలనందుదురధిపా. 129

వ. ఇట్లుదక్షకుమారులు బహువిధమహీరుహచ్ఛాయాసమాసీన మునిజనసల్లాపముఖరితమగు తత్తీరంబు ప్రవేశించుసమయంబున- 130

సీ. పల్లవంబులతోడ భాసిల్లుచుండెను
వల్లకీపాటలాశ్వత్థతతులు
కోరకంబులతోడఁ గొమరుదీపించెను
గోవిదారాశోకకురవకములు
నవపుష్పములతోడ నవకంబులైమించె
గురువిందచంపకకుందలతలు
పరిపక్వఫలశుభాకరములై తెలివొందె
సహకారకదలికా జంబుదములు

గీ. సార్వకాలంబుదత్రీరజాతవిమల
భూరుహావళులీరీతిబొలుపుమిగుల
బ్రహ్మవిద్యాప్రవీణులై పరగునట్టి
నక్షత్రచయములు చనుదెంచి తత్క్షణంబు. 131

చ. తొలకరిలో మెఱుంగులనఁ దోరపుకాంతులమించినంతతో
జ్జ్వలహరిచందనాంకిత కుచంబులచేఁ దెలివొందు పాండ్యదే
శలలితమానినీమణుల సన్నపుఁబయ్యెదలంగదల్చుచున్
మలయగిరీంద్రవాయునతి మందగమున్ గొనుచుండె నవ్యోదర్. 132

క. హరిచందనగిరివాయువు
లురుముగవీ తెంచెనంత హర్షోన్నతులై
పరగుచు దక్షకుమారకు
లిరువుగనచ్చోట నిలిచి రీశ్వరసములై. 133

వ. ఇట్లు హర్యశ్వులు సింధుసముద్రసంగమంబునం గలుగు నారాయణ సరోవరంబున పరిపూర్ణంబులగు జలంబుల నఘమర్షణ స్నానంబులు చేసి తదనంతరంబున సూర్యాభిముఖులై వాయుభోజనులై లక్ష్మీవల్లభునిఁగూర్చి తపంబు సేయుచుండి రాసమయంబున. 134

సీ. భసితాంగరాగవిభ్రాజితదేహులై
రజతశైలముమాడ్కి రమణ మెఱసి
పావనఘనశిరఃపటలంబులోయన
జడలూర్ధ్వముఖములై సందడిలగ
మేఖలాత్రితయసమ్మిళితంబులై కృష్ణ
కృష్ణచర్మదీప్తులు కటిస్థలము నలమ
స్ఫటికాక్షమాలికాభ్రమణ వేగముగూడి
కరనఖంబులకాంతి మెఱసిచెలఁగ

గీ. ఘనసదాగతిఘట్టనాక్వణితమగుచు
మహతియనువీణభుజముపై మలయుచుండ

బ్రహ్మకడనుండిదక్ష పుత్త్రకులకడకు
నరుగుదెంచెను నారదుం డతిముదమున. 135

హర్యశ్వబలాశ్వులకు నారదుండు బోధించుట

ఉ. దేవమునీంద్రుఁడిట్లరుగుదెంచి ప్రియంబునవారికిట్లనుఁ
పావనులార మీరు మితభూషణులై వసుధాతలంబునన్
గేవలమైనదృష్టిపరికించినఁగాని ప్రజాభివృద్ధి లే
దీవివరంబు మీ రెఱుఁగు డింతతపంబున నుండ నేటికిన్. 136

సీ. గరిమనదృష్టనిర్గమరాష్ట్రబిలమను
బహురూపములు గల్గుపడతి నొకతెఁ
బుంశ్చలీపతియైన పురుషునినొక్కచో
దిరముగా నిల్చిన గురుని నొకనిఁ
బంచపంచాద్భుత ప్రభవగేహంబున
ద్వివిధ ప్రవాహమై వెలయుదీని
భ్రమకరంబగుచుఁ జిత్రకథా విశేష వి
ఖ్యాతమై తెలివొందు హంసనొకతి

గీ. నెఱుఁగకజ్ఞతబొంది మీ రీవిధమునఁ
శాస్త్రవిరహితమగు తండ్రిశాసనమున
భ్రమప్రజాసర్గ మొనరింపఁబొలుపడఁగ
ననువుగాదని నారదుం డరిగె దివికి. 137

వ. అంతహర్యశ్వులు నారదనిగదితంబగు వాక్యంబు లాకర్ణించి యదృష్టనిర్గమరాష్ట్రబిలంబనునది యాపరమేశ్వరాధార ప్రతిపదవాక్యరచనాసమన్విత శాస్త్రార్థ దర్శనంబనియు బహురూపావృతయగు పడతి సర్వేంద్రియ వ్యాపార సహకారియగు మనంబనియు పుంశ్చలీపతియగు పురుషుండు మాయామోహితంబగు చిదాత్మయనియు నొక్కచోట దిరముగా నిల్చిన గురువనునది సర్వాతీతంబై యవ్యయంబైన బ్రహ్మంబనియు, బంచపంచాద్భుత ప్రభవగేహంబనునది పంచవింశతి తత్త్వాశ్రయంబైన దేహంబనియును, ద్వివిధప్రవాహరూప యనునది బంధమోక్షకరంబు

లైన నైష్కర్మ్యశాస్త్రంబులయందు సమాగతంబైన మతియనియు, భ్రమకరంబగుచు చిత్రకథావిశేష విఖ్యాతహంస యనునది సమ్యగ్జ్ఞానంబనియును నిట్లు తద్గీతవాక్యగతాగూఢార్థంబు లెఱింగి జీవుండు ముముక్షాకరంబగు మానవదేహంబు ధరియించియు సాత్త్విక శాస్త్రదర్శనంబుల బహువ్యాపారసమేతంబగు హృదయంబును నియమించి మాయాగుణంబులం జెందక బుద్ధిసమేతుండై బ్రహ్మ బంధువనంబరగునని నిశ్చయార్థంబుదలపోసి యాకుమారకులు సమ్యగ్జ్ఞానసమేతులై ధ్యానమార్గంబున బ్రహ్మంబందు లీనంబైన యంత దక్షుండు నారదకృతంబున నిజకుమారులు నిధనంబగుటవిని శోకంబునొంది మఱియు నతండు కుమారసహస్రంబు గాంచిన వారలు శబలాశ్వులను నామంబుల జనకనియుక్తులై యనుభవ సర్గ నిర్మాణమునకు నుద్యుక్తులై నారాయణతీర్థంబునకుం దపంబు సేయంజని యఘమర్షణస్నానంబుచేసి వాయుభోజనులై పుండరీ కాక్షునర్చించి యుదఙ్ముఖాసీనులై బ్రణవంబుచ్చరించి 138

శ్లో. ఓం నమోనారాయణాయ పురుషాయమహాత్మనే
విశుద్ధసత్త్వనిష్ఠాయ మహాహంసాయధీమహి. 139

చ. అనియెడుమంత్రరాజమును నంబుజనాభునిగూర్చి దక్షుసం
జనితకుమారకుల్ తపము సంతతమాచరణంబుసేయం ద
ద్వనమున కేగి నారదుడు వారలంగాంచి ప్రియంబుతోడ ని
ట్లనియెను హేతుగర్భిత పదాభినుతంబగువాక్యవైఖరిన్. 140

గీ. వినుడుశబలాశ్వులార మీకెనయు వేడ్క
భ్రాతలందరు జనినట్టి పదవిజనిన
పురుషుడత్యంత పుణ్యసంప్రాప్తినొంది
దివిజనుతుడగుచు సుఖించుదినములోన. 141

వ. అనిపలికి మఱియునిట్లనియె. 142

సీ. గరిమనదృష్ట నిర్గమరాష్ట్రబిలమను
బహురూపములనొప్పు పడతియొక తె

బుంశ్చలీపతియైన పురుషునినొక్కచో
తిరముగానిలచిన గురునినొకనిఁ
బంచపంచాద్భుత ప్రభవగేహంబున
ద్వివిధప్రవాహమై వెలయు దేసి
భ్రమకరంబగుచు చిత్రకథావిశేష వి
ఖ్యాతిమై తెలివొందు హంస నొకటి
గీ. నెఱుఁగ కజ్ఞతఁబొంది మీ రిప్విధమున
శాస్త్రవిరహితమగు తండ్రిశాసనమున
భ్రమ బ్రజాసర్గమొనరింపఁ బొలుపడగఁ
దనువుగాదని నారదుం డరిగె దివికి. 143

వ. ఇట్లునారదనిగదితంబైన వాక్యగతార్థంబెఱిగి, శబలాశ్వులు సమ్యగ్జ్ఞానసమేతులై ధ్యానయోగంబునఁ దమతోఁబుట్టువులుఁ జనిన మార్గంబునఁ, బునరావృత్తిరహితులై బ్రహ్మంబునందావిర్భవించి రంత దక్షుండంతయునెఱింగి నారదుంగని పుత్రశోకజనితంబైన రోషంబున నిట్లనియె. 144

నారదుండు దక్షునిశాపంబు పరిగ్రహించుట

చ. వినుముదురాత్మ నారద వివేకవిహీనుఁడవై గుణత్రయం
బనువునఁ దీర్ప నేరని మదాత్మజులన్ సుకుమారదేహులం
గనుగొని నీవు దుర్మద వికారసమేతుఁడవై రయంబునన్
మునుకొనిభిక్షుధర్మచయముం బ్రకటించినయంతమత్సరతన్. 145

క. ఘనముగమద్వాక్యము గై
కొననొల్లక కార్యమెల్ల గోల్పుఱచి తుదం
జని రవ్యయపదమునకును
బునరాగమనంబులేక బుధసన్నుతులై. 146

వ. తత్కారణంబునం బ్రజాసర్గంబునకు విఘ్నంబువాటిల్లె, సజ్జనులైన వారలకు సర్వసమత్వంబుగాని జీవులయందు విపరీతధర్మంబొదవునే యని పలికి రోషభరితమనస్కుండై దక్షప్రజాపతి మరియునిట్లనియె.

సీ. మున్మదాంధుఁడవయ్యు దూఱంబునను జూడ
సజ్జనచిహ్నముల్ చాలఁగలిగి
భిక్షుధర్మము చెప్పి పృథుకవర్తనులను
నాశంబుచేసితి నాశుగతిని
వైరంబు లేనిచో వైరంబు గల్పించి
చెఱుతువు శౌర్యమిట్లరుగుదెంచి
సంతతస్నేహపాశనికర్తనుండవు
క్రిందుమీ దెఱుఁగవు కీర్తి లేదు

గీ. విష్ణుభక్తులలోన సవిష్ణుఁడనని
తిరుగుచుండెద వక్కటధీరమతిని
సమ్మదముతోడ నేరీతి నమ్మవచ్చు
భూసురాధమ నీవు దుర్బుద్ధిసహిత. 148

క. కోపంబడఁగదు నాకిఁక
దీపించిన కోపవహ్ని ధృతి చెడి చెదరెఁ
శాపం బిచ్చెద పట్టుము
పాపాత్మక సకలలోక పరిహృతచరితా. 149

వ. అని మరియును. 150

గీ. ఇక్కడక్కడనైన నెచ్చోటనైనను
సంచరింతువు నీవు జగములోన
నిలయమైనచోట నిమిషమాత్రంబైనఁ
దివిరి నిలువలేక తిరిగెదవిక. 151

వ. అని దక్షప్రజాపతి శపియించిన నారదుండు తచ్ఛాపంబంగీకరించి చనియె. నయ్యవసరంబున. 152

దేవాసుర నరతిర్యఙ్మృగాదుల జననము

వ. జలజాసనప్రార్థితుండై యాప్రజాపతియు నిజపత్నియగు నశిక్ని యందు రూపవతులైన కూతులం నరువదింటం గనియె. నిట్లా

కూతులను ధర్మునకు బదుగురను కశ్యపునకుఁ బదిమువ్వురను చంద్రునకు నిరువదేడ్వురను భూతునకు నాంగీరసునకుఁ గృశా శ్వునకు నిద్దరేసిచొప్పున నార్వురను దార్క్ష్యునకు నలువురను నీక్రమంబున నిచ్చె వారి నామంబు లాకర్ణింపుము. 153

గీ. అట్టిపుణ్యవతుల నీ చేడియలఁ జెప్ప
సవతులేని యట్టిసవతులయ్యుఁ
గడుపుఁబడసి రెట్టి కడుపునఁబుట్టిరో
కడిమిఁజగమెల్లఁ గడుపుగాఁగ. 154

వ. *భానువు, లంబయు, కుముదయు, జామియు, విశ్వయు, సాధ్యయు, మరుద్వతియు, వసువును, ముహూర్తయు, సంకల్పయు, ననఁబడు గురుధర్మునకుపత్నులై కొడుకులంబడసిరి. వారెవ్వరంటి రేని భానువునకుఁగు బేరుండును, ఋషభుండును, నింద్రసేనుండును ననుముగ్గురు పుట్టిరి. లంబకు విద్యోతుండుపుట్టె. విద్యోతునకుస్తనయిత్నుండు పుట్టెఁ, గుముదకు సంకటుండుపుట్టె, సంకటునకు కీటకుండుపుట్టె, గీటకునకు గుర్గాభిమానులైన దేవతలు జనియించిరి. జామియను దానికి దుర్గమంబుజనియించె. విశ్వయనుదానికి విశ్వేదేవతలు జనియించిరి. వారల పుత్రికులనంబరగిరి. సాధ్యయనుదానికి సాధ్య గణంబులుపుట్టె. వానికినర్థసింధుండుపుట్టె. మరుద్వతియనుదానికి మరుద్వంతుండును, వసువునందు వాసుదేవాంశుండైన యుపేంద్రుం డనంబడు జయంతుండుపుట్టె. ముహూర్తయనుదానికి సకలభూతం బులకు జన్మంబు తమతమకాలంబున సగుటంజేసి యాయాఫలం బులనిచ్చు మౌహూర్తకులనియెడి దేవగణంబులు పుట్టిరి. సంకల్ప యనుదానికి సంకల్పుండైకాముండనంబుట్టె. వసురయనుదానికి ద్రోణుండును, బ్రాణుండును, ధ్రువుండును, నర్కుండును, నగ్నియు, దోషుండును, వస్తువును, విభావసుండును, ననవసువులెనమండ్రు పుట్టిరి. ఆవసువులందు ద్రోణునకు భార్యయైన యభిమతియందు హర్ష, శోక, భయంబులుపుట్టె. బ్రాణునకు భార్యయైన యోజన స్వతియందు సముండును, నాయువును బులోజయు, ననువారలు

పుట్టిరి. ధ్రువునికి భార్యయైన ధరణియందు వివిధంబులైనపురం బులుపుట్టె. నర్కునకుభార్యయైన వాసనయందుఁ దుష్ట్యాదులు పుట్టె. నగ్నికి భార్యయైన వసుధారయందు ద్రవిణకాదులును, గృత్తికలయందుఁ గృత్తికాపుత్రుం డనంబరగు స్కందుండుపుట్టిరి. దోషునికి శర్వరియనుభార్యయందు హరికళయైన శింశుమారుండు పుట్టె. వస్తువునకు నాంగీరసయనుభార్యయందు శిల్పాచార్యుం డైన విశ్వకర్మయు, నావిశ్వకర్మకు నాకృతియును సతియందు జాక్షుషమనువును బుట్టె నామనువువలన సిద్ధ, సాధ్యగణంబులు పుట్టిరి. విభావసునకు నుషయనుభార్యయందు శుచియును, రోచి ష్ణుండును నాతపుండును బంచయాముండును దివసంబును బుట్టిరి. మరియు కర్మంబులయందు నేమిటసంతోషించునట్టి రోచిషమను వులు నాతపంబునుం బుట్టిరి. అతనికి దివసంబుపుట్టె. శంకరాంశజుం డైన భూతునకు సురభియను భార్యయందుఁ గోటిసంఖ్యలైనఁ రుద్రగణంబులు రైవతుండును నజుండును భవుండును భీముం డును వామదేవుండును నుగ్రుండును వృషాకపియును నజైక పాదుండును నహిర్బుధ్నుండును బహురూపుండును మహాత్ముం డును ననువారలును భయంకరులైన రుద్రపార్షదులైన ప్రేతలును నాయకులుంబుట్టిరి. అంగిరసప్రజాపతికి స్వధయనుభార్యయందుఁ బితృగణంబులుపుట్టిరి. సతియనుభార్యకు నథర్వణవేదంబుపుట్టె. కృతాశ్వునకు నర్చిసరయను భార్యయందు ధూమ్రకేశిపుట్టె.ధిష ణయనుభార్యకు వేదశిలుండును దేవలుండును దయుండును మనువు నుం బుట్టిరి. తార్క్ష్యునకువినతయు, కద్రువయు,పతంగియు, యామి నియు ననునల్గురుభార్యలందు బతంగికి బక్షులుపుట్టె. యామినికి శలభంబులుపుట్టె. వినతకు సాక్షాత్కరించిన యజ్ఞాధిపతికివాహ నంబైన గరుడుండును, సూర్యునికి సారథియైన యనూరుఁడును బుట్టిరి. కద్రువకు భుజంగంబులుపుట్టె, జంద్రునకుఁ గృత్తికాది ఋక్షంబులు భార్యలు వారలయందు దక్షశాపంబున క్షయ

రోగుండై సంతానంబు బడయనోపకుండె. నప్పుడు దక్షప్రసాదం
బున క్షయరోగవిరహితుండై కళలంబొందె. మఱియును. 155

సీ. *కామితప్రదుఁడైన కశ్యపుకౌగిట
ముచ్చటదీర్తురే ముద్దురాండ్రు
రఖిలలోకములకు నవ్వారై సకలంబు
పూజలగొందురే పువ్వుబోండ్లు
బలియురై పుత్రులు పౌత్రులు త్రిజగంబు
లేలంగఁ జూతురే యిందుముఖులు
ముంగొంగుపసిడియై మూల్గుపుణ్యంబుల
విఱ్ఱవీగుదురెట్టి వింతరాండ్రు
గీ. వారిగలకవ్వకడుపుల నేనుపరుల
నరిదిబిడ్డలఁబడసిన బిసుదుసతుల
నామములు నన్వయంబులు నీమనంబు
బూనఁజెప్పెదవినవయ్య మానవేంద్ర. 156

తరల. *అదితియున్ దితిగాష్ఠయున్ దనువ య్యరిష్టయు, దూమ్రయుం
విదితక్రోధవశాఖ్యసారసవేడ్కతో సురభిన్మునిన్
మొదలుగా దివియున్ యిలప్రియ ముఖ్యమూసరమాదిగా
ముదితలెన్నఁగఁ గన్నసంతతి ముజ్జగంబుల భూవరా. 157

సీ. *చాలఁగదివికిని జలచరంబులుపుట్టె
మరి కిరాతులు సరవకునుశునులు
సురభికి మహిషాది సురభులు జనియించె
తామ్రికు శ్యేన గృధ్రములు కలిగె
మునికి నప్సరసాదిమూకలు జనియించె
నిలగనె భూరుహంబులను గ్రోధ
వశకుద్భవిల్లె దుర్వారసర్పంబులు
సరియూతుధానులు సారసకును

సీ. నుప్పతిల్లిరి గంధర్వులోకమ్ము మొగినం
రిష్టకుదయంబునొందిరి త్రిదశరిపులు
పదియు నెనమండ్రైనట్టి విదితబలులు
వారినామాన్వయంబులు గోరివినుము. 158

వ. ద్విమూర్ధుండును, ధూమ్రకేతుండును, శంబరుండును, నరిష్టుండును, హయగ్రీవుండును, విభావసుండును, నయోముఖుండును, శంఖశిరుండును, స్వర్భానుండును, గపిలుండును, నరుణుండును, బులోముండును, వృషపర్వుండును, నేకచక్రుండును, ననుతాపసుండును, విరూపాక్షుండును, విప్రచిత్తియు, దుర్జయుండును ననువారలు వీరలలోన స్వర్భానునకుఁ బ్రభయనుకన్యకపుట్టె. దానినముచివివాహంబయ్యె. వృషపర్వునకు శర్మిష్ఠయను కూతురుపుట్టె. దాని నహుషపుత్త్రుండైన యయాతి పెండ్లియయ్యె. వైశ్వానరునకు నుపదానవి హయశిర, పులోమ, కాలకేయులను నలువురుపుట్టిరందు నుపదానవి హిరణ్యాక్షునకుం బత్నియయ్యె. హయశిరనుమనువు ద్వాహంబయ్యెఁ బులోమకాలకేయులిద్దరను గశ్యపప్రజాపతి చతుర్ముఖ ప్రజాపతివాక్యంబునం గైకొనియె. నాయిరువురకు సమరకోవిదులైన దానవులు పులోమజకాలకేయాదులనం బుట్టిరి. వారికి నఱువదివేలరాక్షసులు జనియించిరి. వారు యజ్ఞకర్మంబునకు విఘాతులై వర్తింప వారలనింద్రునకుఁ బ్రియంబుగా బ్రహ్మదేవప్రేరితుండై యర్జునుండు వధియించె. మఱియు విప్రచిత్తికి సింహిక యనుదానియందు రాహువు పూర్వజుండుగాఁ గేతుశతంబుపుట్టె. రాహువుగ్రహత్వంబు గైకొనియె. మఱియుఁ బురాణపురుషుండైన నారాయణుండు తనయంశంబున నే పరమభాగ్యవతిగర్భంబున నవతరించె. నాయదితివంశంబుగావున వినుపించెద సావధానుండవై వినుము. వివస్వతుండును, నర్యముండును, బూషయు, త్వష్టయుఁ, బరితుండును, భవుండును, ధాతయు నరుణుండును, మిత్రుండును, శక్రుండును, నురుక్రముండును నను నాదిత్యులు జనియించిరందు వివస్వతునకు శ్రాద్ధదేవుండును సాంజ్ఞయందుఁబుట్టె.మఱియు ఆదిమి

ధునంబై యముండును యమియునుంబుట్టి సంజ్ఞ బొడబమైన నశ్వనీ దేవతలుపుట్టిరి. ఛాయాదేవియందు శనైశ్చరుండును, సావర్ణి మనువును తపతియనుకన్యకయును బుట్టె రాతపతిని సంవరుణుండు వరియించె. నర్యమునకు మాతృకయను పత్నియందు జర్షణాయువులు పుట్టిరి. వారికి మనుష్యజాతియని మనుష్యులని బ్రహ్మచేత నామంబులు కల్పింపంబడియె. పూష దక్షునింజూచి దంతంబులు వికృతంబుగానవ్విన నతండుకోపించి దంతంబులుబాడనణచిన నాట నుండియు భగ్నదంతుండై పిష్టాదులు భక్షించుచుండె. త్వష్టకు దైత్యసంగమైన రచనయనుకన్యకకు నధికబలాఢ్యుండైన విశ్వరూపుండుపుట్టె. నావిశ్వరూపుని దేవతలపై గోపించి బృహస్పతి తొలంగిపోయినం దమకు నాచార్యునిగావరియించిరని చెప్పిన శుక యోగీంద్రునకుం బరీక్షున్న రేందుడిట్లనియె. 159

దివిజుల పలాయనము

సీ. *అరయంగ యోగీంద్ర యద్భుతంబయ్యెడు
సురులపై నేటికి సురగురుండు
కోపించె నీతఁడు గురుభావమున దేవ
తలకేమి యాపదగలుగఁజేసె
నెఱిగింపు మనవుడు నిందుడిందు త్రిభువనై
శ్వర్యమదంబున సత్పథంబు
గానక వసురుద్రగణములు నాదిత్య
మరుదశ్వినీముఖ మండలములు
గీ. సిద్ధచారణగంధర్వజిహ్మగాది
సురులు మునులును రంభాదిసుందరాంగు
లాడి పాడంగ వినుతిసేయంగఁగొలువ
నొక్కభద్రాసనంబున నుక్కుమీఱి. 160

సీ. *నిండుపున్నమనాఁడు గండరించిన చంద్ర
మండలశ్రీలతో మాఱుమలయు

భద్రవిద్యోతాత పత్రంబులంగల
మిన్నేటితెరగల మెఱుఁగుఁగొలువఁ
గలితదివ్యాంగనా కరతల చామరీ
చారశ్రేణులు జాడపడఁగఁ
జింతామణిస్ఫటికాంత రత్నానేక
ఘటితసింహాసనా గ్రంబునందు

గీ. నూరుపీఠంబుపై శచియుండనుండి
వరుస దిక్పాలకాది దేవతలుగొలువ
సాటిసెప్పంగరాని రాజసముతోడ
నింద్రుడొప్పారె వైభవ సాంద్రుడగుచు. 161

క. *గురుతరధర్మక్రియ నయ
గురుఁడు మరున్మంత్రవిషయగురుఁడు వచశ్శ్రీ
గురుఁడును సమస్తసురగణ
గురుఁడు గురుండరుగుదెంచెఁ గొలువునకు నృపా. 162

చ. *అమితతపఃప్రభావుఁ గరుణాత్ముని గీష్పతిఁజూచి రాజ్యదు
ర్దమ మదరేఖనింద్రుఁడు వృథాతనగద్దియ లేచకుండె నె
య్యమున నెదుర్కొనంజనక యాసనమీయక గౌరవోపచా
రములఁ బ్రసన్నుఁజేయక తిరంబుగదివ్య సభాంతరంబునన్. 163

క. *అప్పుడు య్యింద్రునికన్నులఁ
గప్పిన సురరాజ్యమద వికారంబునకున్
జప్పుడుసేయక గృహమున
కప్పుణ్యుఁడు తిరిగిపోయె నతిఖిన్నుండై. 164

చ. *ఎఱుఁగమిజేసినట్టి గురుహేళనమంత నెఱింగియింద్రు డ
చ్చెరువడి భీతినొంది యతి చింతితుఁడై తలపోసిపల్కె న
ప్పరమపవిత్రులోకనుత భవ్యచరిత్రువిశేష పాదపం
కరుహముఁబూజసేయక యకర్మముఁజేసితినప్రబుద్ధినై. 165

క. *త్రిభువనవిభవమదంబున
సభలోసద్గురువునకుఁ బ్రసన్ననకుల స
త్ప్రభువునకు నెగ్గుసేసితి
శుభములుదొలఁగంగనే నసురభావమునన్. 166

ఆ. *పారమేష్ఠ్యకరుణ పదవినొందినవారు
లెస్స వారికెదురు లేతురనుచు
విబుధవరులవలన వినఁబడెనేనియు
నదియె పరమధర్మ మంత్రముమొదల. 167

ఆ. *కుపథవర్తులగుచు కుత్సితదుర్వాచో
నిపుణులైనవారి నిడివితెలిసి
దొలఁగ లేకవా రధోగతిఁ బడుదురు
తప్పలేక రాతితెప్పభంగి. 168

ఉ. *కావునలోకవందితుని కార్యవిచారునియింటికేగి త
త్పావనమైనపాదములపై మకుటంబుఘటిల్ల మ్రొక్కి త
త్సేవయొనర్చి చిత్తమువశించి ప్రసన్నునిఁజేతునంచు న
ద్దేవవిభుండువోయె నతి తీవ్రగతిన్ గురుధామసీమకున్. 169

సీ. ఈరీతిఁ తనయింటి కేతెంచు దేవతా
పతిరాక యాబృహస్పతియెఱింగి
యధ్యాత్మమాయచే నడఁగి యదృశ్యుఁడై
పోయెనపుడు దేవ పుంగవుండు
సకలంబు పరికించి జాడఁగానక గురుని
చింతించి దలపోసి చిన్నవోయి
పోయిన విధమెల్ల చాయలు రాక్షస
పీటలు వేగులవారివలన
గీ. తెలిసిమిక్కిలి తమలోన తెలివినొంది
యందఱునుగూడి భార్గవునాశ్రయించి
తత్కృపాదృష్టిఁ దమశక్తిదట్టమైన
దేవతలమీద దాటికిఁ దెరువుపెట్టి. 170

క. ధూర్తులు సమస్తకిల్బిష
మూర్తులు వరధర్మకర్మముంచి మార్గా
నర్తులు దుర్ణయకారణ
కీర్తులు దానవులు సనిరి గీర్వాణులపై. 171

స్రగ్ధ. *దండింగోదండ కాండోద్ధతరథ హయవే
దండతండంబుతోడం దండెత్తెన్ మెండుగానద్దనుజనికరముల్
దైవతాకోటిమీదం జండబ్రహ్మాండభేద్య జ్జయభయరవముల్
సర్వదిక్షోభగానుద్దండ ప్రఖ్యాతలీలం దలపడి సురల్
దర్పులై వారితోడన్. 172

చ. *మదమున దేవదానవులు మత్సరులై కడుబిచ్చలించి సం
పదలకుఁగోరి పోరునెడ భార్గవుమంత్రకళావిశేషులై
గుదురుగ వారియస్త్రముల కోర్చి మహాసురవైరియేసెఁ బె
న్గదులుగఁ గ్రువ్వ దేవతలు కోల్తలకోర్వక పాఱిరయ్యెడన్. 173

ఆ. *దనుజవీరులేయు దారుణదివ్యాస్త్ర
దళితదేహులగుచుఁ దలలువీడ
నోడి పాఱి రద్భుతోపేతబలులైన
త్రిదశవరులు బిట్టుదట్టినట్లు. 174

క. ఒకమొగముగాక దివిజులు
దికమకగొని వైరులెల్ల దీకొనిదమ్మున్
బకబకనగ నకనకలై
లుకలుకఁబరువెత్తిరోడి లోఁగుచుభీతిన్. 175

చ. *దనుజుల గర్వరేఖయును దానవవీరుల యంపజోకయున్
మనుజవిశేష భోజనుల మచ్చరికంబు నిశాటకోటి యే
చినబలశౌర్యముల్ దమకు సిగ్గును హాని మహాభయంబు ని
ర్గుణమును జేయుచున్మలికఁ గోల్తలకోపక పాఱిరార్తులై. 176

క. *అమరులు విసృష్టదారుణ
సమరులుశరభిన్నదేహసంతాపగుణ

భ్రమరులు దైత్యకిరాతిక
చమరులు కమలజునికడకుఁ జనిరి భయార్తిన్. 177

ఉ. *ధాతకు దైవతావిభవ ధాతకు బుణ్యజనానురాగ సం
ధాతకు నమ్రలోకహిత దాతకు వైదికకర్మమార్గ వి
న్నేతకు నుల్లసద్విభవ నేతకు సర్వజగజ్జయాంగ జ
భ్రాతకుఁ బుణ్యయోగిజన భావవిజేతకు మ్రొక్కి రయ్యెడన్. 178

సీ. భాసురవిష్ణునాభ సరోరుహమునందు
సర్వజ్ఞమూర్తివై సంభవించి
వార్ధినదీద్వీప వనసమేతములుగా
భూస్వర్గపాతాళములు సృజించి
పశుపక్షిమృగకీట పన్నగమనుజాది
బహుజంతువుల నందుఁ బాదుకొల్పి
యాజంతుతతులకు నాహారమైథున
నిద్రాదిసుఖములు నిగుడఁ జేసి
గీ. పుత్రదారాదిమోహముల్ పొందుపఱచి
జగముఁ బుట్టింప రక్షింప సమయఁ జేయఁ
గర్తవై యుండువనయంబు ఘనత మెఱసి
పంకజాసనలోకైక భక్తవరద. 179

క. బ్రహ్మలకును జనకుఁడవై
బ్రహ్మజ్ఞమనస్సరోజ పరిపూర్ణమహా
బ్రహ్మంబున విహరింతువు
బ్రహ్మానంతస్వరూప పరమార్థజ్ఞా. 180

సీ. అవధారువిన్నప మఖిలలోకాధీశ
యాతుధానులు మదోద్వృత్తులగుచుఁ
భార్గవ మంత్రప్రభావసంపన్నులై
సంపూర్ణభుజగర్వ సహితులగు

శర ఖడ్గ చాప తోమరచక్రముద్గర
పాశకుంతములఁ జేపట్టి మెఱసి
భీకరాకారులై పేర్మితో సమర రా
జ్యంబెల్ల బలిమితో నాక్రమించి

గీ. రాని శాటుల నేరీతినణపవచ్చు
నిట్టిచందంబు మా కానతీయవలయు
ననుచు విబుధులు ప్రార్థింపనబ్జజాతుఁ
డమరపతితోడననియె నిట్లాదరమున. 181

బ్రహ్మవాక్యంబున విశ్వరూపుని నాచార్యునిగా దేవతలు వరించుట

క. ఆఖండలుండు మొదలుగఁ
లేఖానీకముల బ్రహ్మలేనగవున ని
త్యాఖండసత్యపారస
శేఖరవాక్యములవారి సేదలుదీర్చెన్. 182

వ. ఇట్లుబ్రహ్మదేవుండు దేవేంద్రప్రముఖులైన దేవతలకనుకంపాతి
శయంబున నభయంబొసంగి యిట్లనియె. 183

చ. వినుము సురేంద్ర రాజ్యమదవిహ్వలితాత్ముఁడవై సభాస్థలం
బునకు గురుండువచ్చినను బూజయొనర్పక రత్ననిర్మితా
సనముననుండి గైకొనమిఁ జక్కననిర్జరరాజ్యవైభవం
బనియత రాక్షసాపహృత మయ్యెనుదద్గురు పాతకంబునన్. 184

క. అవనీసురులను గురువుల
నవమానముసేయునరుల కతిరభసమున
న్నవనియు సిరియును వాయువు
పరివిమలసత్కీర్తి కులవిభావము నడఁగున్. 185

క. గురుఁడును హితుఁడును ధరణీ
సురుఁడును నీతిప్రభావశోభితుఁడును నై

పరమార్థ పారగుండగు
గురుఁ డమరానీకములకు గురుమాత్రుండే. 186

క. ధనరాజ్య వృత్తకుల యశో
వ్వనవిద్యాశౌర్య సంభవముల ను మదముల్
మునినైన జీకుఁజేయును
ఘనునైననుబధిరుఁజేయుఁ గ్రిమ్మొప్పంగన్. 187

క. అదిగాన మదవిమోహిత
హృదయుఁడవై కానలేక హితుఁడగు గురునిన్
మదినవమానము చేసినఁ
జెదరినకలుషమున బలిమిచెడె నమరులకున్. 188

క. మంత్రిజ్ఞుఁడు భార్గవుఁడభి
మంత్రించినబాణజాల మందినయపుడే
సంతాపరహితులగుచును
దంత్రంబున గెలుతు రమరతతి నయ్యసురుల్. 189

ఆ. కినిసెనేని శుక్రుఁడనిమిషాధి పతిత్వ
మణగఁజేయుశక్తుఁ డతనిమాయ
నెఱిఁగిమారుసేయ నితరులకలివియె
గురుఁడుదక్షుఁ సకలగుణవిశాల. 190

వ. అనిపలికి పంకరుహాసంభవుండు శచీవల్లభునకు మఱియునిట్లనియె 191

సీ. అసురులతోఁబుట్టువౌ నారచనయందుఁ
గాంచెను ద్వష్టవిఖ్యాతయశుని
విశ్వరూపాఖ్యుని విపులదేవాభ్యాస
సంయుతు నఖిలశాస్త్రప్రవీణు
నతఁడు యోగాభ్యాస మాచరించుచు మల
యాద్రిపై నున్నవాఁ డతిముదమునఁ
జర్చింపగురునితో సమమెన్నఁగావచ్చుఁ
గులతపోవిద్యలఁ గొదువలేక

గీ. యామహాత్ముఁడు శుక్రమాయాబలంబు
నణఁచిరక్షింపఁగలఁడు మి మ్మతిరయమున
నతనిఁ బ్రార్థించి సురపురోహితునిఁగాఁగ
వందనముసేయవలయుఁ బావనచరిత. 192

వ. అనిపురందరునకు నట్టివృత్తాంతంబుచెప్పి కమలభవుండంతర్ధానంబు
నొందె. నంత దేవతాగణంబుతోడ దదాజ్ఞ నంగీకరించి గోత్రభేదన
సమేతులై మలయాద్రికింజని యచ్చోటఁదపంబుసేయుచున్న విశ్వ
రూపుం గనుంగొని యభివందనం బాచరించి వినయంబున నిట్లని
స్తుతియించిరి. 193

సీ. అతిథులమగుచు నీ యభిమతాశ్రమభూమి
కరుగుదెంచితిమి భవ్యస్వరూప
పితృదేవతలకు సంప్రీతిగా సమయోచి
తంబగుకార్యంబు దలఁపవలయుఁ
దనయులకుత్కృష్టధర్మంబు పితృగణ
శశ్రూషణంబని శ్రుతులుచాటుఁ
బుత్రసంయుతులైన పుణ్యవంతులకెల్ల
నీప్సితార్థములగు లేవిచిత్ర
గీ. మమరు లముమేము దేవతానాథుఁడితఁడు
మహిమమెఱయుచు భవదీయమంత్రబలిమిఁ
బరపరాభవ జనితార్తి బాపిమమ్ము
నాదరింపంగవలయు సంయమివరేణ్య. 194

సీ. బ్రహ్మస్వరూపంబు పరమార్థ గురుఁడగు
మాతృరూపంబు భూమండలంబు
భ్రాతమరుత్వప్రభాకరంబగు మూర్తి
మునుకొన్న భవదీయ మూర్తిభగిని
ధర్మంబు తనువులు తలఁపంగ నతిథు ల
భ్యాగతుండనఁగ దేహాంశ మనఘ

భవదాశ్రమమున కభ్యాగతా కృతులము
గాన మీకగపడంగానువలసెఁ

గీ. జతురగుణ ధుర్యమత్పురోహితుఁడవైనఁ
నీకతంబున శాత్రవానీకములను
గెలిచి సురరాజ్యమేలెద మెలమితోడ
మమ్ము దయచేసి సమ్మతింపంగవలయు. 195

క. పౌరోహిత్యము గైకొని
మీరితపోమహిమ నసురమృగయూధముల
న్నేరుపున నణచునది బృం
దారకులకువాంఛితంబు ధైర్యనిధానా. 196

గీ. పిన్నవాఁడవైనఁ బ్రియమున భవదంఘ్రి
వందనంబుచేయవలయు మాకు
నరయఁగార్యకర్త లగునట్టి పిన్నలు
వంద్యులధికునకును వరుసతోడ. 197

వ. అని యిట్లు పౌరోహిత్యంబున కభ్యర్థితుండై విశ్వరూపుండు
బృందారక సమూహంబున కిట్లనియె. 198

క. సత్యాచారవిరాజిత
నిత్యోదయుఁడైనగురుని నిందించిన మీ
కత్యంతమైన పౌరో
హిత్యంబొనరింపవశమె యెవ్వరికైనన్. 199

చ. అనయము సాధువృత్తిఁదిరుగాడుమహాత్ములు ధాత్రిపై శిలోం
ఛనుదను దేహధారణము సల్పుచుసజ్జనులందు సత్యముల్
పొనరఁగనాచరించుచును లోకపిగర్హితమైనయట్టి యీ
పనికిని బూనుకొందురె తపఃఫలనాశకులై మనంబునన్. 200

గీ. అయిననేమివిబుధు లరుదెంచినారట
కలదెచేయరాని కార్యమొకటి

ప్రాణమైననిచ్చి భవదీయశాత్రవ
కోటినణచువాఁడ గొదువలేక. 201

వ. అని విశ్వరూపుండు మహేంద్రాదిసురనికరంబులకు పౌరోహిత్యం బునకునై ప్రీతిస్వీకృతంబుచేసి కతిపయదినంబులకు మహేంద్ర పురంబున కరిగి తత్పౌరోహిత్యంబుఁ గైకొని నిజతపఃప్రభావంబున శుక్రమాయాభిగుప్తంబగురాక్షస శ్రీయంతయుం దెచ్చి మహేం ద్రునకిచ్చిన నతండు నారాయణకవచంబున విశ్రాంతుండై విష్ణు మాయాబలంబుకతనదైత్యసైన్యంబులకుఁ బరాజయంబు నొందించి లోకత్రయంబునుం బరిపాలించుచుండె నని చెప్పిన మునీంద్రునకు రాజేంద్రుం డిట్లనియె. 202

క. నారాయణకవచంబున
నేరీతిమహేంద్రుఁ డసురసేవణగించెన్
తేరికొనఁ దెలియఁ జెప్పుము
దూరీకృతకలుషనిచయ దుర్మదహరణా. 203

వ. అనిపలికిన రాజేంద్రునకు మునీంద్రుడిట్లనియె. నృపాలకా నారా యణ కవచప్రభావంబు చెప్పెద వినుము. 204

శ్రీమన్నారాయణ కవచప్రభావము

సీ. స్నానంబుచేసి ప్రక్షాళితపాదుఁడై
సపవిత్రహస్తుఁడై సజ్జనుండుఁ
పాదజానూరు హృత్పద్మముఖంబులు
ప్రణవాదిగామును పఠనచేసి
నయముగా ఓం నమోనారాయణాయ
వర్ణముల్ నిల్పి పర్వములయందు
కరరుహన్యాసంబు గావించి మఱియును
హృచ్ఛిరోభ్రూశిఖా పృథులనేత్ర
గీ. యుగముఃనందునుబ్రణవ సంయుక్తముగను
వసనమోస్తు సదా విష్ణవేయటంచుఁ

బలికి తన్మంత్రివర్ణములఁ బాదుకొల్పి
మంత్రిరూపంబుధరియించి యంతమీఁద. 205

క. నెరిముద్రాసహితంబుగఁ
గరమునభూభూతశుద్ధి గావించితుదన్
హరిఁదలఁపగవలయు సుహృ
త్సరసజమునవాత్మయోగ సహితుండగుచున్. 206

క. పతగేంద్రవాహనంబున
చతురతసర్వాయుధప్రశస్తుండగుచుం
గ్రితురూపమైన విష్ణుఁడు
సతతమురక్షించుగాత సర్వగతుండై. 207

వ. మఱియు జలంబులయందును వరుణపాశంబులయందును మత్స్య మూర్తియు స్థలాకాశంబుల యందు మాయావటు రూపుండగు వామనుండును మహారణ్యంబుల దుర్గమంబులయందును సకల చరాచరసంహారకుఁడగు నారసింహుండును మార్గంబులయందు దంష్ట్రికరాళంబగు నాదివరాహంబును ప్రవాసంబుల నద్రికూటం బులయందును లక్ష్మణుండును రామచంద్రుండును బ్రమోదం బులవలన నారాయణుండును యోగంబులవలన యోగనాథుం డైన దత్తాత్రేయుండును గర్మబంధనంబువలన గణేశుఁడైనకపిలుం డును మదనవికారంబులవలన సనత్కుమారుండును దేవహేళనంబు వలన హయగ్రీవుండును నిరయంబులవలన నాదికూర్మంబును నప థ్యంబువలన ధన్వంతరియును ద్వంద్వభయంబువలన హృషీకేశుం డును కృతాంతునివలన యజ్ఞరూపుండును గోధంబువలన నహి నాయకుండును నప్రమాదులవలన ద్వైపాయనుండును పాషండ గణంబులవలన బుద్ధుండును గలికల్మషంబులవలన గలిక్యవతారుం డును ప్రాతఃకాలంబున గదాధరుండగు కేశవుండును సంగవ కాలంబునందున గోవిందుండును ప్రాహ్ణకాలంబునందున నారాయ ణుండును మధ్యాహ్నకాలంబునందు విష్ణుండును నపరాహ్ణ

కాలంబునందు మధుసంహరుండును సాయంకాలంబున మాధవుండును బ్రదోషకాలంబున హృషీకేశుండును అర్ధరాత్రిసమయంబున బద్మనాభుండును నపరరాత్రంబున శ్రీవత్సాంకుండును బ్రత్యూషకాలంబున జనార్ధనుండును సంధ్యలయందు దామోదరుండును బ్రభాతకాలంబున విశ్వేశ్వరుండును మమ్ము రక్షింతురుగాక యని సర్వతోరక్షుంబుగావించి. 208

సీ. వరసుదర్శన భవద్వదన వేగంబున
దహియింపు మహితులదర్పమణచి
విపులగ దేశనీ విస్ఫులింగంబుల
శత్రుసింహంబుల సంహరింపు
మతులితఖడ్గ మాయతులధారల చేత
బ్రత్యర్థి శిరములు పగలమోదు
మధికమై నాయక యక్షరక్షోగణ
గ్రహభూతతతులను మహిమదునుము

గీ. దైత్యమర్దన శత్రు కృత్యములవలన
సర్పములు మొదలుగాఁగల సకలదుష్ట
......జంతు సంఘంబులెల్ల సంక్షయమునొంది
సర్వమునునొక్కవీకతో సమయుగాత. 209

వ. అనియిట్లు నారాయణాత్మకంబగు కవచంబుపఠియించిన నరుండు కీర్తివిజయంబులం బొందు నట్లుగుటం జేసి శచీనాయకుండే నారాయణకవచంబు పఠియించి యాతుధీనసైన్యంబు గెల్చి సురరాజ్యంబు పాలనంబుఁ జేసె. నిట్టి నారాయణకవచంబు పఠియించి తొల్లి కౌశికుండను భూసురోత్తముండు మరుదేశంబున శరీరంబువిడిచె. నంతనద్దేహంబు భూమిపై నస్థిమాత్రావశేషంబయ్యె. నంతనొక్కనాడా శరీరంబుమీద చిత్రరథుండును గంధర్వనాయకుండు కాంతాసమేతుండై పుష్పకంబెక్కి వియన్మార్గంబున సంచరించుచు నారాయణకవచ ధారణాస్థిపైఁజని పుష్పకంబుతోడఁ దలక్రిందైపడిన

వాలఖిల్యోపదేశంబునఁ దచ్ఛల్యంబులుగొనిచని గంగాజలంబుల వైచిస్నానంబుచేసి క్రమ్మరనిజవృత్తిఁజెంది పుష్పకారోహణంబు చేసి వనితాసహాయుండై నిజపురంబునకుంజనియె. నీనారాయణ కవచంబు ధరియించిన మానవుండు జగద్వంద్యుండగుటంజేసి యీ విద్యవిశ్వరూపునివలన నభ్యసించి శచీనాయకుండు శత్రువులనిర్జించి త్రైలోక్యరాజ్యవిభవంబుగైకొనియెనని చెప్పి శుకుండిట్లనియె.

## విశ్వరూపుని శిరోహరణము

సీ. త్వష్టకుమారుఁడై తనరెడునావిశ్వ
రూపుని కరుదుగారూఢితోడ
నన్నాదనంబు మద్యపమును సోమపం
బన మస్తకత్రితయంబుగలదు
యజ్ఞతంత్రాదులం దతడుహవిర్భాగ
మసురులకియ్యఁగా నమరవరుఁడు
కోపంబురెట్టింపఁగొట్టె వజ్రంబునఁ
దన్మస్తకంబులు ధరణిగూల
గీ. నందునన్నాదనంబగు నట్టిశిరము
తిత్తిరీరూపమయ్యెను దెలియమద్య
పంబుకలవికమయ్యెనాపైని సోమ
పముకపింజలమయ్యె విభ్రమముమెఱయ. 211

వ. ఆసమయంబున 212

ఉ. తప్పిదమయ్యెనంచుఁబరి తాపమునన్ సురలెల్లఁగుందగా
ముప్పిరిగొన్నరోషమున ముందరగానక దేవనాయకుం
డప్పుడు బ్రహ్మహత్యతనహస్తములందు పరిగ్రహించి తా
నెప్పటియట్ల నిల్చిన మహీవలయంబున భూతసంఘముల్. 213

క. శరదంతంబునమిక్కిలి
పరితాపమునొందిశుద్ధిఁ బరగెడుకొఱకై

సురపతి బ్రహ్మఘ్నుండసి
మొఱవెట్టెను బంచభూతములు త్రిజగములన్. 214

వ. అంత జగంబులహాహాకారంబులైన సురనాయకుండు భయభ్రాంతుండై తద్బ్రహ్మహత్యానివారణంబగు నొక్క కార్యంబుచింతించి వసుధాతలంబునకేతెంచి మదీయ బ్రహ్మహత్యా సంభవంబగు కలుషంబువలనం జతుర్భాగంబులు పరిగ్రహింపవలయునని భూ, జల, వృక్ష, స్త్రీలం బ్రార్థించి వారలకు ఖాతంబుపూర్తియు సార్వకాలపవిత్రతాగుణంబును భంగంబులైన శాఖామూలంబులు పునరంకురితంబులుగాను స్త్రీలకు సార్వకాలసురతసుఖంబును వరంబులుగానొసంగి తనహత్యచతుర్భాగంబులు పంచియిచ్చిన భూమియూషరరూపంబును, జలంబులుఫేనాకృతిని తరువులునిర్యాసభావంబును, సతులు రజోవికారంబులను బ్రకటంబులుసేయుచు నాపాతకంబుధరియించి రిట్లుసురవిభుండు గతకల్మషుండై యుండె. నప్పుడుత్వష్ట నిజకుమారుండైన విశ్వరూపుని మరణంబెఱింగి మహావికటభ్రుకుటిసమాకులితవదనుండై. 215

వృత్రాసుర జననము

సీ. తెఱఁపికననలుఁ బ్రతిష్ఠాపనముచేసి
సవనిగాఁ జరువులు సంగ్రహించి
బ్రహ్మదిబుత్విగ్వర చతుస్సమేతుఁడై
మహిమనాథర్వణ మంత్రములను
దాడితొడినింద్రశత్రోవివర్ధస్వనా
త్వష్టవేల్వఁగ నతి త్వరితగతుల
నంతకుమాడ్కి ఘోరాత్ముఁడై కజ్జల
శైలంబురీతి నాశ్చర్యమొదవ
గీ. ఘనగుహాసమమైన వక్త్రమునునభము
దాకఁ గబళించుకైవడి భీకరమున

నావులించుచు దంష్ట్రిలం దనల మొదవ
నొక్క పురుషుండు వహ్నిలో నుద్భవించె. 216

ఉ. శూలము చేతఁ బూనిఘన శోణిత పాత్రధరించి దేవతా
జాలము భీతినొంది యతిసంభ్రమ మొందుచుఁ బాఱిపోఁ ధను
జ్వాలలు కోపవిస్ఫురిత వహ్ని ముఖంబున నుప్పతిల్లఁగా
పాలికమూర్తి చందమునఁ బర్వుచు దిక్కులు వ్రయ్యనార్చుచున్ .217

క. ద్వాత్రింశ దాయుధంబులు
గాత్రమున ధరించి విబుధ గణములు బెగడన్
సుత్రాముఁ కనుబగ దై
వృత్రుండనఁ బరఁగెనతఁడు వీక్షింపంగన్. 218

దివిజపలాయనము

శా. ప్రావృట్కాలపయోదసంఘరుచి విభ్రాజన్మహాకాయుఁడై
నీవృద్ఖ్యాతజయంబు నాహవమునన్ నిర్జించి నిర్భీతుఁడై
శ్రీవృద్ధిక్షయ హేతువై తనరు లక్ష్మీనాథసద్భక్తుఁడై
యావృత్రాసురుఁ డాక్రమించె సకలాశాధీశలోకంబులన్. 219

వ. ఇట్లు ప్రళయకాలరుద్రప్రతిమానుండగు వృత్రాసురుండుదయించి దినదినంబు బాణమాత్రంబు వృద్ధినొందుచు నిజశరీరంబున విశ్వంబా క్రమించుచునుండె. నయ్యవసరంబున నింద్రాది దేవతాసమూహంబులు నిజవిమతుండగు నావృత్రాసురుం గనుంగొని బాహుబలంబున నాహవసన్నద్ధులై యామహావీరుని నెదిర్చి ఖడ్గాదిమహాయుధంబులు ప్రయోగించిన నయ్యసురవిభుండు తత్ప్రయుక్తంబులగు శస్త్రాస్త్రంబులు గ్రసియింపం దొడంగిన వారలు బలవిహీనులై తేజంబులఁ దొలంగి మహాశ్చర్యంబునొంది భయంబున రయంబు చెడి సరస్వతీతీరంబునకరిగి భక్తవత్సలుండైన లక్ష్మీకాంతునట్లని స్తుతియించిరి. 220

సీ. పంచభూతంబులు బ్రహ్మరుద్రాదులు
నఖిలలోకములస్మదాదిసురలు

మునుకొని యేమహాత్మునకొన ర్తురుపూజ
లంతకుడెవ్వరికై తెలంగు
నద్వితీయుండు నవ్యయుఁడునై యెవ్వఁడు
పుట్టించెఁ ద్రిజగంబుపోలుపుమీఱ
నఖిలదేవర్షి తిర్యగ్నరాదులయందు
నిలుచు నెవ్వఁడు మాయ నెలవుకొల్పి

గీ. సర్వవేదుండునై నట్టిచక్రికరుఁడు
వేదవేద్యుఁడు జగదేకవిశ్వదుండు
బహుళమగు నృత్తసంభవభయమువలనఁ
మించి వేగినమమ్ము రక్షించుఁగాత. 221

గీ. శ్రీసమేతమిమ్ము సేవింపనొల్లక
మీఱిశుభము నొందఁగోరువాఁడు
చెంగలించిశునకలాంగూల ముఖమున
నబ్ధిదాటఁగోరు నట్టివాఁడు. 222

చ. అరయఁగఁదొల్లి పద్మభవుఁ డాత్మనివాససరోజకర్ణికాం
తరముననుండి తీవ్రపవనప్రహితాధిక వీచిమాలికా
పరిమితఘోషభీషణ మహార్ణవమందుఁ బ్రమాదమగ్నుఁడై
పరువడితోమిముందలఁచి పారముఁబొందెను భక్తవత్సలా. 223

శా. ఓరాజీవదళాభిరామ నయనా యోనిత్యసన్మంగళా
యోరాత్రించరకంఠనాళదహనా యోసర్వలోకాధిపా
యోరత్నాకర మేఖలా పరివృతా యోభక్తకల్పద్రుమా
యోరాకాహరిణాంక రమ్యవదనా యోపద్మనాభాచ్యుతా. 224

క. నారాయణ లక్ష్మీపతి
దారుణదైత్యేంద్రవిపుల దర్పవిదళనా
వారిధిశయనదయాపర
భూరమణా నిన్ను శరణు పొందెదమీశా. 225

విరోష్ట్య సీ. శ్రీనాథ సంతతాశ్రిత జనౌఘానేక
గజఘటాహార్యక్ష కాంతిసహిత
శరణాగతార్తినాశక జగన్నాయక
దీనరక్షక శేలిహీనశయన
శంఖ చక్ర గదాసి శార్ఙ్గాక్షజలజాత
సహితరాజితహస్త సకలనిలయ
హారకంకణకిరీ టాంకలాంఛిత దేహ
ఖగరాజకేతన కంజనయన

గీ. రాక్షసానీక ఘనకంధరావిదళన
నిశ్చలానందనీరద నీలతేజ
జలధితనయాధినాయక జననరహిత
సచ్చిదాకార జయజయసత్యచరిత. 226

శా. శ్రీవత్సాంకితమూర్తయేవిమల రాజీవాక్షయుగ్మాయ ల
క్ష్మీవక్షోంబుజ షట్పదాయవసుధా మిత్రాయ సర్వాత్మనే
భావజ్ఞాయ కృపాకరాయహరయే భక్తార్తి సంధాయినే
గోవిందాయ సమస్త దైత్య నివహ క్రూరాయ తుభ్యం నమః. 227

క. సూనాస్త్రజనకపుణ్యా ని
ధానాబలమగ్గలింప దానవబలముక్
బోనీకపట్టి బవరము
లోనన్ బొలియింపు కమలలోచనపాలుపై. 228

వ. అని యిట్లు సురలుసన్నుతించుసమయంబున శంఖ చక్ర పద్మ గదా
ధరుండును పీతాంబరాలంకృతుండును పుండరీకవిలోచనుండును
రత్నభూషణ భూషితుండును శుభలక్షణ పరిపూర్ణుండును నగు
లక్ష్మీకాంతుండు గరుడవాహనారూఢుండై శ్రీవత్సకౌస్తుభ
చిహ్నంబులుగలిగి నిజలక్షణలక్షితులగు షోడశవర్ష దివ్యపురుష
సమేతుండై ప్రత్యక్షుండైనంజూచి తద్బృందారక సందోహంబు

లందఱుఁ జెలంగుచు నుప్పొంగి సాష్టాంగదండప్రణామంబులాచరించి
కరకమలంబులు మొగిచి యిట్లని స్తుతియించిరి. 229

ఉ. ఇందుకళాధర ప్రియ మహీవనితాధిప సన్మునీశ్వరా
నందితవై భవోన్నత జనార్దన సర్వనివాస దేవతా
బృందవిరోధి దుర్మద విభేదన మీకతిభక్తితోడుతన్
వందనమాచరించెదము వారిజనాభ దయావిరాజితా. 230

క. వారాహరూపవామన
నారాయణ వాసుదేవ నలినోదర ల
క్ష్మీరమణ పరమమంగళ
కారణ రక్షింపుమమ్ము కరుణఁదలిర్పన్. 231

లయగ్రాహి. విప్పుగసజాండమును జెప్పనదిచిత్రముగఁ
గప్పుకొనభయమునను నొప్పులువిడంగా దప్పిగొనిరక్కసులు
చప్పుడెడలించివడిఁ
దప్పుదెరువులఁ జనఁగనుప్పరములోనన్ ద్రిప్పలనుఝల్లనుచు
నిప్పులొగిరాలఁగను
నొప్పినడదనుజవతి దప్పిఁగొనగోళ్ళం ముప్పిరగురోషమున నప్పు
డటుచీరి మీ
కొప్పుగన సురలకివిచొప్పులె నృసింహా. 232

వ. మఱియు మహాపురుషకారుణిక పరమహంసలగు పరివ్రాజకుల
చేత సమాధిభేదంబుల నాచరితంబులగు భావంబులం బరిస్ఫుటపరమ
హంసధర్మంబులచేతను స్తోత్రంబులుసేయుని నేరంబునలన నపా
కృతంబగు నాత్మలోకంబునను లబ్ధమాత్రంబులగు భావంబులుగలిగి
యాత్మసమర్పితంబులై యపరిక్షితంబులగు దేహంబులకు నుత్పత్తి
స్థితిలయకారణంబై వర్తింతువు. గుణవిసర్గాతీతుండవై దేవదేవుం
డవై సర్వజనంబులకు హితంబులగు కుశల ఫలంబులిత్తు వాత్మా
రామస్వభావంబున షడ్గుణైశ్వర్యసంపన్నుండవగు నీవీశ్వరావ

గాహ మహాత్మ్యంబున సర్వాచీన వికల్పంబులంగలిగిన వికర్త విచారప్రమాణ భాగవతాశ్రయదురవగ్రహప్రజ్ఞలంగలిగి వాదన్యై పుణ్యాసమేతులగు విద్వాంసుల వివాదావసరంబులందును వితతంబులగున స్తి, నాస్తివాక్యంబులు లేక నిజమాయామహిమంబున నన్యోన్యాంతర్ధానంబున యుక్తిగోచరుండవై నను విషదుఃఖంబులన్ భ్రాంతిజనియించినయట్లు మానవునకు ద్రవ్యంబునందు ద్రవ్యాంతరభ్రాంతి జనియించు సర్వేశ్వరా నీవుజగత్కారణంబవై సర్వభూతప్రత్యగాత్మ వగుటంజేసి సర్వసుగుణోపలక్షితుండవై యద్వితీయుండవై వర్తింతువు. సర్వలోకశరణ్యా సర్వదేవతామానసత్వత్పాదంబులయందు సంతుష్టమనస్కులై యనవరతసుఖంబులందిసాదితదృష్టశ్రుతవిషయ సుఖాదివేసంబులుగల పరమభాగవతోత్తములు సర్వభూతప్రియంబైన సర్వోపమనిలయంబైన భగవన్మంగళదివ్యవిగ్రహంబునందు నివృత్తమనస్కులగువారల మఱియు సాధనకువలులై యాత్మప్రియబాంధవులగు సజ్జనులు భవదాచరణంబునంజేసి యాధర్మంబుమఱువనేర్తురే. త్రిభువనాత్మభవన, త్రివిక్రమ, త్రిలోకమనోహరానుభవ, భవద్విభూతిభేదంబులగు దేవదానవులకు ననుపమసమయంబెఱింగి నిజమాయాబలంబున సురాసురనరమృగజలచరాదిరూపగతుండవై తదీయాపరాధానురూపంబగుదండనంబున నాజ్ఞాపింతువు. సర్వదుఃఖనివారక, భవన్ముఖసరోరుహంబువలన వినిర్గతంబగు వచనామృతవిశేషంబున మదీయమనస్తాపనివారణంబు సేయనవధరింపుము. సకలజగదుత్పత్తిస్థితినిలయంబగు ప్రధానకారణంబగు దివ్యమాయానుగతవినోదుండవై సకలజీవనికాయంబులకు బాహ్యాభ్యంతరంబులం బ్రత్యగాత్మప్రధానరూపంబుల దేశకాల దేహావస్థావిశేషంబులందు నుపాసనానుభవంబులంగలుగు సవనప్రత్యయసాక్షివై పరబ్రహ్మస్వరూపంబగు భవత్పదపద్మఫలాశచ్ఛాయ నాశ్రయించెదమని దేవతాసమూహంబులు లక్ష్మీవల్లభునకువిన్నవించి మఱియు నిట్లనిరి. 233

క. మా తేజములా యుధములు
చాతురివృత్రాసురుండు సమయించెను వా
డే తెఱఁగున నిహతుండగు
నా తెఱఁగిక నానతిమ్ము యజ్ఞాధీశా. 234

సీ. పరమహంసస్వరూప జ్ఞానసాగర
సర్వాంతరస్థిత సకలవేద్య
కృష్ణస్పష్ట్యాధిపకీర్తి విభ్రాజిత
భవపాంథనిలయ భూభారహరణ
సత్పురుషార్చిత స్వాగతనిరవంద్య
నిరుపమావ్యయరూప నిర్మలాంగ
పరమపరాపర పరమార్థవిశ్రుత
సర్వేశసర్వజ్ఞ సామలోల
గీ. సచ్చిదానందమయరూప సత్యవిభవ
భవవిరించాది సన్నుతభక్తవరద
పైభయంబున భవదంఘ్రి వైభవంబు
నాచరించెద మతిభక్తినఖిలజనక. 235

సురలకు శ్రీమన్నారాయణుఁడు ప్రసన్నుండగుట

వ. అని యిట్లు దేవతాసమూహంబులు బహువిధంబుల సంస్తుతింప
సంతసించి లక్ష్మీవల్లభుండు వారలతో నిట్లనియె. 236

సీ. ప్రీతుండనైతినే పృథులభవత్కృత
స్తవమున కమరబృందంబులార
యేప్రీతినొందిన నేమిపొందఁగరాదు
చర్చింపమద్భక్తి సహితులకును
నేకాంతకృతబుద్ధి హితుఁడగుతత్వజ్ఞు
డన్యంబుగోరఁ డత్యాశబాదలి
నరులతిరోగంబునను బాధఁబొందుచు
గానకోని పథ్యంబుగోరుచుండు

గీ. రదియుఁగావున మీరు దేహములనున్న
భయమువర్జించి చనుఁడు విభ్రమముతోడ
ధీసమున్నతుఁడైన దధిచికడకు
నశ్వినీదేవతలఁగూడి హర్ష మొదవ. 237

వ. వినుము సురేంద్రా పూర్వంబునం ద్వష్టనిజతనూజుండైన విశ్వరూపునకు మదీయంబగున శ్రేష్ఠంబైన కవచంబునుపదేశంబుఁజేసెఁ గ్రమ్మరఁ దత్కవచంబు వృత్రునకుపన్యసించె. దత్కారణంబున భవదాయుధంబు లయ్యసురయందుఁ బ్రయుక్తంబులై నిష్ఫలితంబులయ్యెం గావున నీవు దేవతాసమేతుండవై రయంబునం గతకల్మషుండును పరోపకారప్రవీణుండును నగు దధీచిమునికడకుం జని యశ్వినీదేవ ముఖంబున విద్యావ్రతతపస్సారవంతంబగు తద్గాత్రంబు నిమ్మని ప్రార్థించిన నమ్మహాత్ముండు మీకుశరీరంబునొసంగినఁ దచ్ఛల్యంబులు విశ్వకర్మనిర్మితంబులై శతధారలంగలిగి దివ్యాయుధంబగుచు మ త్తేజోపబృంహితంబై వృత్రాసురశిరశ్ఛేదనకారణంబయ్యెడు నంతనమగులు పూర్వసామర్థ్యంబులంబొంది శస్త్రాస్త్రబలసమేతులై తొల్లిటియట్లతిదివంబునను౦డెదరని శచీవల్లభునకు భావికార్యంబులానతిచ్చి పుండరీకాక్షుండంతర్ధానంబునొందె. నంత మహేంద్రుండును దద్వాక్యంబులంగీకరించి సంతసంబునొంది విబుధగణసమేతుండై దధీచికడకుంజని యమ్మహాత్మునకు దండప్రణామంబులాచరించి యశ్వినీదేవముఖంబుననిట్లనియె. 238

సురలువజ్రాయుధంబుకొరకు దధీచిశల్యంబులుగొనుట

క. మునివరపరపురుషార్థ
ప్రణుతాహార్దప్రభావ రమణీయగుణా
దీనదయారసపూరిత కనుఁగొంటిమి
నిన్ను చక్రికరనుతచరితా. 239

క. క్రతుభుజులము నీగృహమున
నతిథులమైవచ్చినార మంచితమద్యాం

ధిక మీయునలయఁ దడయక
చతురగుణోదారసకలసౌభాగ్యనిధీ. 240

క. అతిథి యేతెంచినప్పుడు
చతురతసంతోషమాత్మ సంధిలఁ దద్వాం
ఛితమీయఁగలుగు పుణ్యుఁ
డతులయగుదు రంబుజోదరాలయమునకున్. 241

గీ. అగ్నిహోత్రసమయమందు
భోజనవేళఁ మధ్యదినమునందుమాపటింటి
సదనమునకుతిరిచను దేఁటఁ దద్వాంఛి
తార్థమీయవలయు నతిముదమున. 242

క. అభ్యాగతులకునతిథులఁ
కభ్యర్చితపూజసేయు నట్టిమహాత్ముల్
సభ్యులుపొగడగఁ బొందుదు
రభ్యుదయస మేతులగుచు హరిమందిరమున్. 243

వ. అదిగావున మదాగమనవృత్తాంతంబెఱింగించెద మాకర్ణింపుము. 244

సీ. వృత్రాసురుండను విదితబలాఢ్యుఁడే
యఖిలలోకంబుల నాక్రమించి
త్వష్ట్రమంత్రప్రభావమున జనించెను
నతడు తన్మనిదక్షిణాగ్నివలన
నానిశాచరనాథునాహవంబున మించి
జలజాసనుండైన గెలువలేఁడు
భవదీయదేహసంభవశల్యకృతమగు
నాయుధంబునఁగాని హతుఁడుగాఁడు

గీ. గానఁ దపమునఁబుణ్యసంచితమైన
నీశరీరంబుమాకిచ్చి నిర్జరేంద్ర
రాజ్యసంస్థాపనముచేసి రమణమెఱయఁ
రూఢి ననురసంఘంబు బోవవలయు. 245

వ. అనియిట్లు బృందారకనియుక్తులగు నశ్వినీదేవతలు పలికినవిని దర
హాసితవదనుండై దధీచి విబుధనాథునాలోకించి యిట్లనియె. 246

క. అడిగెడివ స్తువులడిగిన
నిడఁదగునడుగంగరాని దిమ్మనఁజిత్తం
బొడఁబడునె యెట్టివారికిఁ
గడువేడుకనీయనమర గణనుతచరితా. 247

ఉ. జీవములందుబుద్ధిగల జీవములెక్కువ వానిలోన సం
భావితమూర్తి సంయుతులు మర్త్యులు ముఖ్యులు వారలందు భూ
దేవతలుత్తమోత్తమ విధిజ్ఞులు తద్విభుదేహధారణం
బేవివరింపఁబుణ్యముల పెంపుకుఁగారణ మెన్నిచూడఁగన్. 248

క. బహుజన్మాంతర పుణ్య
గ్రహితుండై మనుజుఁడంత బ్రాహ్మణుఁడై త
ద్విహితాచారంబున లో
'హితుండై ముక్తిఁబొందు క్రమమొప్పంగన్. 249

ఉ. ఘోరములైన దుఃఖములఁ గుందుచునైనను సర్వరోగ సం
పూరిత దేహియయ్యునిజ పుత్రకళత్రవిహీనుఁడయ్యు సం
చారమణంగిపాటవము జాఱిననైననుజీవితంబు తాఁ
గోరుచునుండుఁగాని మృతి గోరడుమానవుఁ డెట్టివేళలన్. 250

క. మధురామధురంబులలో
మధురముజగమందు సకలమాంసంబగు నా
మధురంబుకన్న మిక్కిలి
మధురముదేహంబుసకల మనుజులకెల్లన్. 251

వ. మఱియు బ్రతుకంగోరెడువాఁడు విష్ణుసంప్రార్థితుండయ్యును
స్వపదార్థంబు నిజదేహంబయ్యును ప్రాణులకుమృత్యుభయంబే
భయంబు. విూరడుగుటనాకు మహాశ్చర్యంబు. 252

గీ. *ఎలమిబ్రతుకనిచ్ఛయించినవారికి
దేహమెల్లభంగిఁ దీపుగాదె

యచ్యుతుండువచ్చి యర్థించెనేనియుఁ
తన్నునిచ్చునట్టి దాతగలఁడె. 253

సీ. *అర్థంబువేఁడెడి యర్థులుగలరుగా
కంగంబువేఁడెడి యర్థిగలఁడె
తనకోరికలనిచ్చు దాతగలఁడుగాక
తనదేహమీనేర్చు దాతగలఁడె
యీనేర్చువాఁడు తన్నిచ్చినరోయక
చంపెడునట్టి యాచకుఁడుగలఁడె
చంపియుఁబోవక శల్యంబులన్నియు
నేఱిపంచుకపోవు వారుగలరె

గీ. రమణలోకమెల్ల రక్షించువారికిఁ
హింససేయుబుద్ధి యెట్లుపొడమె
బ్రీతియైనయట్టి ప్రాణంబుపైఁదీపి
తమకుఁబోలెనెదిరిఁ దలఁపవలదె. 254

వ. *అనినదేవేంద్రుండిట్లనియె. 255

గీ. *సర్వభూతదయాపరస్వాంతులకును
పుణ్యవర్తనులగు మిముబోటివారి
కధికసత్కీర్తికాముల కలఘుమతుల
కీయరానిపదార్థంబు లేమిగలవు. 256

గీ. *అడుగరానిసొమ్ము లడుగరాదనిమానఁ
డడుగువానిమాట లడుగనేల
బ్రాంతినడుగుచోట బ్రాణంబులైనను
నిచ్చువాఁడుదాత కిచ్చువాఁడు. 267

వ. *అని పరసంకటంబుదలంపక నిలింపులుగుంపులుగొని వాక్యపరంపర లంబార్థించిన నతండు దరహసితభాషితవదనుండై యఖిలలోక ధర్మంబులెఱింగియు నొక్కింతకాలంబునకుం బ్రీతివాక్యంబిచ్చి, దీనిసహింపందగు మీయట్టివారికిఁ బ్రియంబగునేని నెప్పుడైన విడు

వంబడిడి శరీరంబువిడిచిపుచ్చుట యేమి దుర్లభంబధ్రువంబైన దేహంబుచేత గీర్తిసుకృతంబులెవ్వాఁడార్జింపఁడు నతండు పాషాణాదులకైనఁ గనిష్ఠుండు. మీవంటిపుణ్యశ్లోకులచేతనాశింపంబడిన యీశరీరంబప్రమేయ ధర్మార్జితంబే దేహంబుచేతనైనను సకలభూతంబులు శోకానుభవంబును సంసారాంధకూపంబును మోహజాలంబులు హరియించునట్టి మహాకష్టదైన్యాత్మకంబైన శరీరంబు శునకసృగాలాదుల పాలుగాకుండ మేలయ్యె నని నిశ్చితాత్ముండై దధీచి తత్త్వాలోకనంబుచేత నిరసితబంధనుండై బుద్ధీంద్రియమానసంబులతోడఁగూడిన క్షేత్రజ్ఞునిఁ బరబ్రహ్మస్వరూపుండైన పుండరీకాక్షు నారాధించి యేకీభూతంబుజేసి యోగజ్ఞానంబున శరీరంబువిడిచి నప్పుడింద్రుండతనిశల్యంబులు విశ్వకర్మనిర్మితంబైన శితశతధారాసమాన్వితంబై మహాతేజోబృంహితంబై వెలుంగఁజేసిన వజ్రాయుధంబుగైకొని భగవత్తేజోబృంహితుండై యైరావతారూఢుండై సకలదేవోత్తమ, గరుడ, గంధర్వ, ఖచర, కిన్నర, కింపురుష, సిద్ధ, విద్యాధర సేవితుండై సకలమునిజనంబులువినుతింప త్రిలోకహర్షకారియై వృత్రాసురుపై నడచెనపుడు. 258

## వృత్రాసుర వధ

ఉ. *వృత్రుఁడు దానవాన్వయపవిత్రుఁడు లోకజిఘాంసక క్రియా
సూత్రుఁడు విగ్రహాగ్రహణ సుస్థిరవాక్యవివేకమాన చా
రిత్రుఁడు దేవతోరగదరీకృతనత్రుఁడు రోషభూషితా
మిత్రుఁడు శత్రుఁడాఁకగని మిక్కిలియైనయుగాంతకాకృతిన్. 259

క. *మెండుగలదనుజనాయక
మండలములుగొలువనడచె మహిమోన్నతి వే
దండముల నడుమఁజనునడ
గొండయునుంబోలె నిబిడకోపోద్ధతుఁడై. 260

క. *కాలగళుఁడడరికడువడి
గాలునిపైగవయుమాడ్కి ఖరతరరవ సం

చాలిత సర్వదిగంతరుఁడై
లీల మహేంద్రుమీఁద నతఁడరిగెన్నృపా. 261

వ. *ఇట్లు రుద్రగణంబులు మరుద్గణంబులు నాదిత్యగణంబులు నశ్వినీదేవతలు పితృదేవతలు వహ్నియు నైరృతియు వరుణ వాయు కుబేరేశానాదులు కిన్నర కింపురుష గరుడ గంధర్వ ఖచరప్రముఖంబులగు నిందప్రసైన్యంబులతోడ శంబరుండును నసర్వుండును ద్విమూర్ధుండును వృషభుఁడును హయగ్రీవుండును శంఖశిరుండును విప్రజిత్తుండును నయోముఖుండును బులోముండును వృషపర్వుండును హేతియుఁ బ్రహేతియు నుత్కలుండును ధూమ్రకేశియు విరూపాక్షుండును గపిలుండును విధిపారుండును విభావసుండును నిల్వలుండును బల్వలుండును దందశూకుండును వృషభధ్వజుండును కాలనాభుండును మహానాభుండును భూతసంతాపుండును వృకుండును మొదలైనదైతేయులును యక్షులును రక్షోగణంబులును సహస్రసహస్రంబులై మాలి సుమాలి ప్రముఖులైన యాతుధానులంగలసి చతురంగబలసమేతులై మృత్యువునకభేద్యంబగు మహేంద్రసైన్యంబు నెదిరించి భయవర్జితులై రయంబున సింహనాదంబులు చెలంగ గదా, పరిఘ, బాణ, ప్రాస ముద్గర, తోమర, భిందిపాల, శూల, పరశు, ఖడ్గ, శతఘ్ని ముఖంబులైన నిశితవివిధాయుధంబులచేతఁ దార్క్షకంబులజలదంబులాచ్ఛాదించుచందంబునం గీర్వాణబలంబులంగప్పిన వారును జడియక నిజబాణప్రయోగంబులఁ గదాయుధంబులఁ దునియలు చేసి రిట్లుభయసైన్యంబులుఁ గలయంబడి మహారణంబుసల్పుచుండి రాసమయంబున. 262

ఉ. దానవవీరులేచిన మదంబుననుద్ధతులై రయంబునన్
బూనికతోడ శస్త్రతరుభూధరముల్ ధరియించి దేవతా
సేనలతోడ బిట్టదరఁ జేసిరియుద్ధము సాహసక్రియన్
దినమణిభాసమానపటుదివ్యరథంబుల నెక్కియెక్కుడన్. 263

ఉ. అంతట నింద్రముఖ్యులగు నావిబుధుల్ రిపుసాయకావలీ
సంతతుఁగోర్చిచక్రశర జాలనితాసిసముజ్జ్వలద్గదా
ఘాతములన్ దదంగములు కోపముతో విదళింపవారల
త్యంతమునాజిభంగపడి యాత్మలఁజిక్కిరి బాధపొందుచున్. 264

గీ. పతిసడించి యాజిఁ బారిపోవుచునున్న
దైత్యవరులఁజూచి దర్పమెసఁగ
వేఱు వేఱుబిట్టుపిలుచుచు నచ్చోట
వృత్రుఁడంతవారి వెరపుదెలిపె. 265

చ. నిలునిలుఁడేలపోయెదరు నేనిటనుండగ దేవసేనను
బలములబాణపాతములఁ జక్కఁగఁజేసి మహేంద్రముఖ్యులన్
గెలిచి జగంబులోపలను కీర్తులునిల్పఁగఁ బాదుగొల్పి మీ
రలుపినుతింపఁ బొందెదను రంజిలగాజయమత్యుదారతన్. 266

వ. అనియిట్లు వృత్రాసురుండు విఱిగిపాఱెడు దైత్యులవేర్వేరఁజీరుచు
నెలుంగెత్తి మఱియునిట్లనియె. 267

క. జననమునొందినవారికి
ననయము మరణంబునిశ్చయంబగుచోటం
దనువులకన్నను గీర్తులు
ఘనముగజగమందునిలుచుఁ గలకాలంబున్. 268

క. శూరుండును నిశ్చలయో
గారూఢుఁడు కీర్తిముక్తులాశించి మృతిం
గోరుదురుగాని జీవిత
మేరీతినినిలుపఁగోర రీక్షింపంగన్ 269

క. పగవారుసూచిముందర
నగుచుండఁగసిగ్గులేక సట్టడవులకున్
మొగతిరిగిచనగమీకును
దగవేయిది పాటిచుగునె దానవులారా. 270

వ. అనుచున్న తాసురుండు వలికిన దానవేంద్రుఁడు హరిభక్తివర్జితు లగుటం జేసి కాలానుకూలంబైన దివిజులచేతం బరాజితులై నిలువరింపలేక చనుటఁ జూచి మహాక్రోధకలితుండై యసురనాథుం డిట్లనియె. 271

చ. తిరుగుఁడు దైత్యులార రణధీరుని నింద్రునిఁ జంపలేరు మీ
రెఱుఁగరు మత్ప్రభావము మదీయశరంబుల నాజిలోన ద
చ్ఛిరమటు ద్రుంచి భూతబలిఁ జేసి మహేంద్రుని రాజ్యమంతయున్
మురువున నేలి మీకు నతిమోదము నర్చెదఁ బ్రస్తుతింపఁగన్. 272

క. తిరిగిన వారల నహితులు
పొరిగొందురు గానిఁ సాగి పోవఁగ నీరీ
తెఱఁగుఁ దలపోసి వెఱవక
తిరుగుఁడు నేనున్నవాఁడ దివిజుల నడఁపన్. 273

వ. అని వృత్రాసురుండు సాంత్వనపూర్వకంబుగాఁ బలికిన నీతిమార్గంబులైన వచనంబులకులజ్జించి శంబరుండు మొదలైన సేనాధిపతులిరుగెలంకులఁ దిరిగి యేతెంచు దేవతానీకంబులఁ దాకి రోషావేశంబున నుప్పొంగుచు భల్లంబుల కుల్లంబులు తల్లడిల్లఁ బ్రగ్మ్మరమహారణంబు సేయుచు నిలిచిరి. వరుణునితో నముచి, శంబర, ద్విమూర్తులును పవనునితోడ వృషభాసుర హయగ్రీవ శంఖశిరస్సులును నిర్రృతితోడ విప్రజిత్త్యయోముఖులును బులోముండును, సప్తజిహ్వునితోడ వృషపర్వుండును హేతిప్రహేతులును గుబేరునితోడ నుత్కలుండును ధూమ్రకేశియు విరూపాక్షుఁడును దండధరునితోడ నిల్వలుండును, గపిలుండును. విభావసుఁడును, విశ్వేదేవతలతోడఁ బల్వలదందశూక వృషభధ్వజులును, నశ్వినీదేవతలతోడఁ గాలనాభ, మహానాభ భూతసంతాపన వృకాదులును, నెదిరించి నిబిడంబుగా సమరంబు సలుపు నెడ నుభయసేనాముఖంబులం జెలంగు వాద్యశబ్దంబుల భూనభోంతరాళంబు నంగలుగు భూతంబులు బెగడొంద నన్యోన్యబాణసంఘట్టనసముద్భవ విస్ఫులింగంబుల కడలి

బ్రహ్మాండకటాహంబు బీటలువాఱఁ జక్కడనస్థలంబులఁ దురంగంబులం దోలియు రథంబులం బఱపియు, గజంబులం దిగొల్పియు, రాహుత్తులం బురికొల్పియు, సురదనుజసేనాధిపతులు కలయంబడి భంగంబునొందక విజయంబుఁ గోరుచు సన్నద్ధులై యుద్ధమహోత్సవంబునకు సంతసిల్లుచున్న యెడ నప్పుడు వరుణుండు పంచసాయకంబుల నముచి శంబర ద్విమూర్ధన్యులను బనుపుచు బాణాష్టకంబున వృషభాసుర, హయగ్రీవ, శంఖశిరస్కులను సవితృ శిలీముఖదశకంబున విప్రచిత్త్యయోముఖ పులోములను సప్తజిహ్వుండు ద్వాదశశరంబుల వృషపర్వ హేతి ప్రహేతులను గుబేరుండు పదునేను తూపుల నుత్కలధూమ్రకేశి విరూపాక్షులను దండధరుండు పదియేనుభల్లంబుల నిల్వల కపిల విభావసులను విశ్వేదేవతలు వింశతినారాచంబుల దందశూకవృషభధ్వజులను నశ్వనీదేవతలు ముప్పదియేడువిశిఖంబుల కాలనాభ, మహానాభ, భూతసంతాపవృకాదులను గూల్చిరంత. మహేంద్రుండు శంఖభేరీమృదంగ రవంబులఁ జెవుడుపడం జేయుచు గజారూఢుండై వృత్రాసురునకెదురునడచిన నమ్మహావీరుండును సురలంజూచి యిట్లనియె. 274

క. శూరులు భయపడ రేనియు
వారల కిహపరములెడలు వచ్చినచోటన్
నేరుపు చెదరఁగ ధృతిచెడి
పాఱక నిలువంగవలయు భండనమందున్. 275

చ. సమరమదాంధులై సుర నిశాచరవీరులు సైనికాంఘ్రి సం
క్రమితమహీపరాగమును గ్రమ్మిననమ్మలికంపుఁజీకటుల్
దమకనుదోయికడ్డముగఁ దార్కొనినన్ జలమూదిపోరి రా
క్రమిత నిజాంతరంగపరిఘట్టిత రోషమహాగ్రహంబునన్. 276

క. *అతిగళితరక్తధారా
క్షతములతోఁ గానఁబడిరి సైనికులు మహో

ద్ధతరోషవహ్ని కీలలు
వితతంబై పిక్కటిల్లి వెలికుఱుకుగతిన్. 277

సీ. రవణించుశింజినీ టంకారరవములు
భటసింహనాదంబుఁ బరిభవింప
భీషణోత్తమహయ హేషాతిఘోషంబు
కరిబృంహితస్ఫూర్తిఁ గడలుకొలుప
సమరనిశ్శంకాంకశంఖనినాదంబు
భేరీస్వనంబుల బీరువడఁగ
తుములమై చెలఁగెడు దుందుభిధ్వానంబు
లట్టహాసంబుల నాక్రమింప
గీ. ఘటితశస్త్రాస్త్రనిష్ఠురఘట్టనోగ్ర
ఖరకఠోరోరువిస్ఫులింగంబులడర
దివ్యకోటీరమణిఘృణి దిక్కరింప
సమరమొనరించిరసురులు నమరులపుడు. 278

వ. *ఇట్లు ప్రళయసంరంభవిజృంభితసముత్తుంగరంగత్తరంగంబై భైర
వారావస్ఫూర్త మహార్ణవంబునుంబోలియు నంతసంక్రాంతజంఝా
పవనపరికంపిత దీర్ఘనిర్ఘాతనిబిడనిష్ఠుర నీరదంబులుంబోలె నుభయ
సైన్యంబులుం గలసి సంకులసమరంబు సలుపుసమయంబున యుగాం
తకృతాంత సకలప్రాణిసంహారకారణలీలలు బోలె బదాతి
రాహుత్తులు రథికులు నొండొరులుం గలసి శస్త్రంబులుపఱుపుచు
శంఖంబులుపూరించుచు గడలన్ వ్రేయుచుఁ గుంతలంబులఁబొడు
చుచు నడిదంబులనడచుచు కులిశంబులగుప్పుచుఁ గఠారంబు
లంగొట్టుచు ముసలంబులన్ మోదుచు ముద్గరంబులం బాదుచుఁ
జక్రంబులందు్రించుచు శబలంబులనొంచుచు సురియలమెఱుముచు
శూలంబులంగు్రమ్మచు వాలంబుల నేయుచు ననేకశరజాలంబుల
శస్త్రంబులుతునియఁగఁజేయుచు గాండీవంబులునరికియుఁ దొడలు
దు్రించియుఁ దుండంబులుఖండించియు మెడలెడలించియు మెదళ్లు
గెడలించియు నడుములుదు్రించియు నాసికలుదెం్రచియుఁ బద

మూలువిఱిచియుఁ బార్శ్వంబులు గఱచియు గజంబులం బఱపియు గాత్రంబులను జీఱియుఁ గుంభంబులు బగులమోదియుఁ గొమ్ములు పెకలించియు హస్తంబుల జఱచియుఁ బాదంబుల ఘట్టనంబు సేయుచు నంగంబులు నొంచియు రథంబులు నలియించియు రథికుల నలినలి సేయుచు సారథులఁ జంపియు సైంధవంబులం దుంచియు శిరంబుల నొగిలించియు నాసికంబుల సిలించియు ఛత్రంబులం దునుమాడియు చామరంబుల విఱిచియు సైన్యంబులం దునుమాడియు సాహసులం జంపియుఁ బరస్పరగుణవిచ్ఛేదంబును నన్యోన్యకోదండ ఖండనపటుత్వంబును నుభయసైన్యసైంధవసారథిరథికవికలంబును నొండొరుల పాద జాను జంఘా హస్త మస్తక నిర్దళనంబును రక్త మాంస మేదః పంకసంకలితసమరాంగణంబును నై యతిఘోర భంగిం బెనంగి పోరి రప్పుడు. 279

చ. *సమజయముం గసమాజయము సౌమ్యపరిశ్రమముం సమోరువి
క్రమముసమాస్త్ర శస్త్ర బల గర్వమునై కడుఘోరభంగినా
నముచిహరాగ్రిగణ్యగణ నాథులతోడ నిశాచరేశ్వరా
ధములు దురంబు సేసి రొగి దార్కొని వృత్రుబలంబు ప్రాపునన్. 280

వ. *అప్పుడు- 281

లయగ్రాహి. *మొత్తముగ బాఱు పెను నెత్తురు మహానదులఁ
దత్తరముతో నొదిగి కుత్తుకలు మోవం
జిత్తములనుబ్బి వెస నెత్తుకొను భూతముల
నత్తుకొని శాకినులు జొత్తిలెడు మాంసం
బుత్తలముతో మెసఁగి నృత్తములు సేయు మద
మత్తఘన ఢాకినులు వృత్తగతిఁ బ్రేవుల్
బిత్తరమునం దిగిచి యొత్తి మెదడున్ మెసఁగి
గుత్తగొనుచుండ భయనృత్తగతి నొప్పెన్. 282

వ. *ఇట్లు దేవదానవులు నర్మదాతీరంబునఁ గృతయుగమునందలపడి త్రేతాయుగంబుఁ జొచ్చునంత కాలంబుఁ బోరు దారుణంబుగాఁ జేయు

చుండ నంతవృత్రాసురుండు భుజబలంబు పెంపునం దెంపు జేసి కంపింపక నిలింపులపై నతిసాహసంబున మహావృక్షపాషాణగిరిశిఖరంబులు వర్షించిన. 283

మ. *గిరిపాషాణమహీజముల్ గురియఁగా గీర్వాణులన్నింటి ని
ష్ఠుర నారాచపరంపరల్ పఱపుచుం జూర్ణంబుఁగావింప ని
ర్భరలీలం దమ సేయు సత్త్వములుదోర్భంగంబులై పోవఁగాఁ
బెరలన్ రాక్షసయోధవీరుల మనోభేదంబు సంచ్ఛిన్నమై. 284

క. *పరిచురముగ రాక్షసావలి
ఖచరులపై నేయు నిబిడకాండానలి దు
ర్వచనుఁ డెడనాడు మాటలు
సుచరితుని యందుఁ బోలె జొరవయ్యె నృపా. 285

వనమయూరం. *అంత సుర లేయు నిబిడాస్త్రములపాలై
పంతములుదక్కి హతపౌరుషముతో ని
శ్చింతగతి రక్కసులు సిగ్గుపడి భూమిన్
గంతుకొని పారి రపకారపరులార్పన్. 286

క. *కొండలఁ బోలెడు రక్కసు
లొండొరులం గడచి పారి రుక్కఱి పటుకో
దండ ముఖ సాధనాదులు
భండనమున వేసి దివిజ పతులార్వంగన్. 287

వ. *ఇట్లు సమరతలంబుఁ బాసి తవపారిపుడాసిపఱచు దండనాయకులం జూచి కుటిలమతిం బకబకనగుచు వృత్రాసురుం డిట్లనియె. 288

ఉ. *క్షుల్లకవృత్తిమీఁకగుసె శూరులకిమ్మెయిఁ కీర్తిభోగముల్
కొల్లగఁ జేయుచావుమదిఁ గోరిన వారలకైనఁ గల్గునే
తల్లడమంది యీపరమధర్మము మానిదలంగ పాడి రే
మళ్ళుడుదుర్దమప్రధనమత్తుఁడు వృత్రునిఁ బ్రాపెఱుంగరే. 289

క. *చావు ద్విధ మైన బ్రాణికిఁ
జావులు రెండరసికొనుఁడు సమరమునందున్

భావింపయోగమందును
జావంగాలేనిజడుని చావున్ జావే. 290

వ. *అని వాసుదేవతేజోవిశేషవిశేషితుండై దవానలకీలలంబోలి వెలుంగుచున్నఁగని వెన్నిచ్చి పాఱెడి యసురవీరులకు ధైర్యంబవలంబింపంజేసి వారలనిడుకొనిముందటనిలిచి సురసేనలంజూచి హుంకరించి స్వర్గానుభవనంబుల నిచ్చగల్గదేని మదవలోకనమాత్రింబు ముందరనిలుతురుగాక యని కల్పాంతానల్పఘనఘనాటోపంబునుంబోలెఁ గఠోరకంఠహుంకార తర్జనభర్జనంబులగర్జిల్లుచు బ్రళయకాలపవన పరిభావితమహాశిఖిశిఖావళులఁ ద్రుణీకరించు కుటిలాలోకనంబుల నాలోకించుచుఁ గాలపరిపక్వలీలాలోలుండైన శూలిపోలిక నాభీల మూర్తియై సకలజీవభారభరణదుర్భరభగ్నబ్రహ్మాండభాండమహాధ్వానంబుభంగి నాస్ఫోటించిన. 291

ఉ. *కూలెజగంబులన్నియును గ్రుంగిరిసూర్యసుధాంశులద్రి ల
ల్లాడె నభస్థలంబగిలె సంబుధులింకెను మింటఁదారలూ
టాడె నహీంద్రుడొల్లవడె నాఁశలుగ్రుంగె నజాండభాండ మ
ల్లాడె విధాతమ్రొగ్గఁబడె నార్చుచువృత్రుఁడు బొబ్బవెట్టినన్. 292

లయగ్రాహి. *కూలిరివియచ్చరులు సోలిరిదిశాధిపులు వ్రాలిరమరవ్రజముదూలిరురగేంద్రుల్
వ్రేలిరిమరుద్గణము జాలిగొనిరశ్వినులు కాలుడిగిరుద్రులవలీలఁబడి రార్తిన్
వ్రీలిరి దిశేశ్వరులుకీలెడలినట్లుసురజాలములు పెన్నిదుర పాలగుట దారా
భీలగతితోడఁదమ కేలిధనువుల్ విడిచి నేలఁబడిమూర్ఛలను దేలిరి మహాత్మా. 293

వ. *ఇట్లు కంఠీరవకఠోరనినాదంబొనరించిన నశనిపాతంబునఁగూలు ప్రాణిచయంబుభంగి నంగంబులెఱుంగక రణరంగంబునంబడి బిట్టు మూర్ఛిల్లిన దివిజరాజసైన్యంబుల వృత్రాసురుండు రణరంగ

దుర్మదుండై మహీతలంబు పదహతులజవజవందూల నిశితశూలంబు గేలంగీలింపుచు మదించినభద్రమాతంగంబు కమలవనంబుసొచ్చి మట్టమల్లాడువిధంబున నిమీలితాక్షుండై పదతలంబుల రూపం బులుమాయుంజమురుచు వెక్కసంబుగఁ గ్రీడించువానిఁ గనుం గొని యిందుఁడు. 294

గీ. ఘనమదంబుతోడఁ గరియూథనాథుండు
కమలవనము చెఱుచు కరణినుర్విఁ
బాదయుగముపూనివడితోడ మట్టాడె
విబుధబలము నెల్ల విస్మయముగ. 295

వ. అట్టియెడ బృందారకనాయకుండు రోషసంకలితుండై దానవవీరుని పైగద వేయ నతండు వామకరంబున నాగదంబట్టుకొని క్రమ్మర నింద్రునిపై దానింబ్రయోగింప నది తదీయవాహనంబు కుంభస్థ లంబుదాకిన నగ్గజేంద్రంబు వజ్రాయుధపాతంబునం బరిభ్రమించు శైలంబుకరణి భిన్నంబగు కుంభస్థలంబునవలనఁదొఱఁగెడు రక్తధా రలందోఁగి జిరజిరందిరుగుచు దొలంగినంబోనీక కుస్తరించి తద్గజేంద్రం బును గయ్యంబునకుం బురికొల్పి మఱియు నొకగదంబూని విరోధిపై నేయ నయ్యసురనాయకుండు దానిందప్పించుకొని నిజ భ్రాతృశిరచ్ఛేదన నిపుణుండైన వజ్రంగనుంగొని నవ్వుచు నిట్లనియె. 296

సీ. భ్రాతృఋణముదీర్ప భాగ్యంబొసంగుచు
నరుగుదెంచిన శత్రువై ననిన్ను
నిటఁగొని మచ్ఛూలనిర్భిన్నహృదయుఁగాఁ
బొలియించువాఁడ దుర్బుద్ధిసహిత
పశువుచందంబునఁ బట్టిఖడ్గంబున
యజ్ఞదీక్షావశుండై నయట్టి
విశ్వరూపునితలల్ద్రవేసి తెట్టులవాని
దేవతాగురుఁడని తెలియవైతి

గీ. వక్కటా లోకనింద్యుఁడవగుచు మిగుల
శ్రీదయాకీర్తిగుణసముద్ఘోషితుఁడవైన
నీశరీరంబు తెగటార్చి నేడు గృధ్ర
ములకు నొనరింతువిందులు ముదముతోడ. 297

క. భవదాయుధసహితములగు
నవయవములు శూలహతములై పడిన తుదం
దివిజులనందరఁ బొరిగొని
బవరంబునభూతములకు బలియొనరింతున్. 298

ఉ. సందియమేలశక్ర తగశత్రుఁడనై మనుచున్న నాపయిన్
గందువతోడఁగుంఠితము గానిభవత్కులిశంబు వ్రేసినం
బందలుగూర్చు విత్తములపాత్రునిఁజెందినమాడ్కి మిక్కిలిన్
నిందితరూపమై యవియు నిష్ఫలమయ్యెడు మాటలేటికిన్. 299

చ. జలరుహనాభు తేజమున సంగరమయ్యెను విష్ణుభక్తిచేఁ
దిలకితమానసుండగు దధీచిమునీంద్రు తపోవిశేషతన్
వెలయుచునున్న వజ్రమున వ్రేసిననాకులిశంబు నాయెడం
బొలయఁగలేదు శ్రీవిభునిఁ బొల్పుగనాత్మను సన్నుతింపగన్. 300

వ. అనిపలికి దివ్యజ్ఞానసహితుండై కదనస్థలంబున . నావృత్రా
సురుండు పుండరీకాక్షునిగుణంబు లిట్లని స్తుతించె. 201

క. తనభక్తులకును విష్ణుం
డనయము త్రైవర్గికాశ్రితాళికిభూతిం
బొనరించుఁ దత్ప్రసన్నతఁ
గొనకొనియెఱుగంగ బరులకుం గోచరమే. 302

చ. కమలభవాదిసన్నుత జగన్నిలయాచ్యుత వార్ధిసంభవా
రమణ సుదర్శనాంచిత ధరావరసన్నుత యోగివర్య హృ
ద్విమలసరోజమధ్య పరివీక్షిత నేభవదీయదాస దా
స్యమునొనరించువాఁడ నిఁక సర్వజగంబులు సన్నుతింపఁగన్. 303

గీ. హృదయవిష్ణురూప మొనరంగదలపుము
జిహ్వహరిగుణంబుఁ జెలఁగిపలుకు
దేహమ్రొక్కు మాదిదేవునిపదపద్మ
మమలబుద్ధితోడ హర్షమలర. 304

ఉ. కోరమహేంద్రపట్టణముఁ గోరను బ్రహ్మపదాంతరస్థితిం
గోరను సార్వభౌమమును గోరనుసర్వరసాధిపత్యముం
గోరను యోగమార్గగతిఁ గోరఁబునర్జననంబు మీపదాం
భోరుహభక్తిగాని మఱి భూషణమాధవ భక్తవత్సలా. 305

చ. తనరినపక్షిపోతములు తల్లులఁగాంచి ప్రమోదమందిన
ట్లనయము క్రేపులాకట రయంబున నావులగన్నరీతిఁగా
వనితలు నాథులందధిక వాంఛయొనర్చినమాడ్కిఁ బుండరీ
కనయన నామనంబుమిముఁ గన్గొనుకాంక్షఁదనర్చునెప్పుడున్. 306

గీ. ఉర్విలోపలసంసారయుక్తులగుచుఁ
బుత్రదారాదిదుర్మోహపూర్ణులైన
దుష్టమానవసఖ్యంబుఁ దొలఁగఁజేసి
గారవింపుముననుఁ బ్రీతిఁ గమలనయన. 307

వ. అనియిట్లు వృత్రాసురుండునిజదేహంబునకు మృత్యువునిక్కంబని నిశ్చయించియు నాయుధంబును నిజకరంబునం బరిగ్రహించి నవ్వుచుం దనలోనిట్లనియె. 308

క. శ్రీనాయకపదభక్తిని
మానితమతివగుచువిష్ణు మాయామోహం
బానుకొనఁ గెలిచినిర్గత
దానవభావంబుతోడఁ దనరితివనఘా. 309

క. రాజసమున నసురులకును
రాజవు రక్షకుఁడవగుచుఁ బ్రబలిననీకుం
దేజంబున హరిపాదాం
భోజంబులభక్తియెట్లు బొడమెమహాత్మా. 310

గీ. అమృతజలధిఁదరుగునట్టి మహాత్మునకు
డప్పిఁజిక్కుజలము డాయునట్లు
హరిపదాబ్జభక్తిసనువైసచిత్తంబుఁ
గోరడన్యమైన కోర్కెనెపుడు. 311

వ. అనిపలికినవిని పురందరుండు మహాదాశ్చర్యంబునొందుచుఁ గద
నంబుమఱచి నిర్విణ్ణుఁడై యున్నసమయంబున వృత్రాసురుండు
శీఘ్రింబ నిజతాపవిమోచనంబు గావలయునని దక్షిణకరంబునం
బూని మహేంద్రునిపైఁ బరిఘప్రయోగంబుచేసిన సంతసయ్యామరా
పతి వజ్రంబునఁదత్కరంబును బరిఘయు నొక్కమెయిం దునిమినఁ
దద్రాక్షసేంద్రుండు భిన్నబాహుండై తెగినపక్షంబులుగలిగిన
గిరిరాజంబుమాడ్కి రక్తసమేతంబగుదేహంబున భీకరాకారుండై
పరిభ్రమింపుచు. 312

క. జగములుమ్రింగెడు నితఁడని
గగనచరుల్ భయమునొంద ఘనశితదంష్ట్రా
యుగళేముల నిప్పులొలుకఁగ
నగరాజముగదలివచ్చె ననరభసమునన్. 313

ఉ. బాహువిహీనుఁ డయ్యసురపాలకుఁడప్పుడు రోషదీప్తుఁడై.
సాహససంయుతుండగుచు సర్వజగంబులుభీతినొంద న
య్యాహవభూమిలోన సురలార్వఁగ డగ్గరిజిహ్వసాచిత
ద్వ్యాహనయుక్తుఁడై తనరు వజ్రకరుం గబళించెఁగ్రూరతన్. 314

సీ. అంత నంతర్గతుండగుగోత్రవిమతుండు
విష్ణుమాయాబల విదితుఁడగుచు
కులిశంబుచేతఁ దత్కుక్షి వ్రయ్యలుచేసి
తన్మార్గమున నతిత్వరితగతిని
వెడలివజ్రంబున వృత్రునికంఠంబుఁ
దెగవ్రేయనాతండు జగతిమీఁదఁ
బర్వతాధిపుమాడ్కిఁబడినఁ దత్తేజంబు
సమకొనివిష్ణులోకమునకరిగె

గీ. సురగణము లెల్ల సంతోషభరితు లైరి
పుష్పవర్షంబుగురిసె నద్భుతముతోడ
భయమడంగెను భూనభోభాగమందు
బ్రహ్మరుద్రాదులరిగిరి భవనములకు. 315

వ. అని శుకుండు వృత్రాసురవధ ప్రకారంబెఱింగించినవిని నరపాలుం
డిట్లనియె. 316

క. సురవిమతుండడఁగినయెడ
సురలెల్లనుసుఖమునొంద సురవిభునకు దు
స్తరదుఃఖమేలకలిగెను
బరువడినదివినగవలయుఁ బరమమునీంద్రా. 317

ఇంద్రుండు బ్రహ్మహత్యాహతుండగుట

వ. అనినరాజునకు శుకయోగియిట్లనియె. 318

క. ఉరువడిననయము వృత్రా
సురపీడితులగుచుఁ దొల్లి సురసంఘంబుల్
అరుదెంచితద్వధార్థము
సురపతిఁ బ్రార్థింపనతఁడు శోకాతురుడై. 319

చ. అనియెనువారితోడుత మహాఘనులార వినుండు పశ్వయూ
పుని వధియింపఁ దజ్జనితభూరిమహాకలుషంబు భూవధూ
వనధరణీజమూలమున వారితమయ్యెనునింక వృత్రహ
త్యను జనియించుపాపము రయంబున నేక్రియమాన్పవచ్చునో. 320

వ. అనినమహేంద్రునకు మునీంద్రుడిట్లనియె. 321

సీ. వినుము దేవాధీశ వెఱవంగవలవదు
భద్రమయ్యెడునీకుఁ బ్రస్తుతింపఁ
నాచరించెదము నారాయణప్రీతిగా
నశ్వమేధంబను యజ్ఞమొకటి

తన్మూలమునను వృత్రవధోద్భవంబగు
కలుషంబునిన్నుసోకకతొలంగు
నాచార్య పితృమాతృహంతయు శ్వపచుండు
పుల్కసుండును బాపపూరితుండు
గీ. నేమహాత్మునినామంబు ప్రేమతోడఁ
దలఁచిశుద్ధాత్ములగుదురు తత్క్షణంబ
యతనిఁగూరిచి హయమేధమాచరింపఁ
దన్మహాసురహనన పాతకమణంగు. 322

గీ. అదియుఁగావునఁ జింతసేయక కడంగి
దర్పితంబగు దంభోళిదారచేత
మించివృత్రునిశిరము ఖండించివైచి
జగమురక్షింపవలయును సంతసమున. 323

క. అనియీరీతిని బలికిన
మునిజనవచనప్రమాణమున నయ్యసురన్
హననంబుచేసెనింద్రుఁడు
ఘనశతకోటిప్రభావకాశితకరుఁడై. 324

వ. ఇట్లువృత్రాసురునివధియించి మహేంద్రుండునిజసదనంబునకుఁజను నెడ వెనువెంటఁబఱచుచుఁ జండాలరూపంబుధరియించి రాజయక్ష్మాక్రాంతంబగు నిజశరీరంబువడంకుచుఁ శిరోరుహంబులువిడియ దీటుచు మీనగంధంబుపగిది దుర్గంధిలంబగుశరీరగంధంబున మార్గదూషణంబుసేయుచు వార్ధకంబునవాతశిరోరుహయై నిలునిలుమని పలుకుచు నతిత్వరగతింజనుదెంచు నొక్కకామినింగని దానివృత్రవధోద్భవంబగు బ్రహ్మహత్యగా నెఱింగి భయాక్రాంతుండై యఖిల దిగంతంబులుదిరిగిననైనను విడువకవెనుఁదగిలెడు దానిమరలింపసామర్థ్యంబులేక కౌబేరదిశాభాగంబునకుంజని యచ్చటమానససరోవరంబున సువర్ణకమలనాళతంతుద్వారంబున సూక్ష్మాకారంబునం బ్రవేశించి యందుదాగి సహస్రవర్ష పర్యంతంబుగానంబడక నిజకలుషనాశంబునకు నుపాయంబు చింతింపుచుండె నాసమయంబున. 325

నహుషుండగస్త్యశాపంబున సురరాజ్యభ్రష్టుండై యజగరంబగుట

చ. అహితులనెల్ల గెల్చి తదవాప్తములైన సమస్త విత్తముల్
బహుళముగాఁగ గూర్చి యతిభక్తిని ధాత్రిశతాశ్వమేధముల్
విహితముగానొనర్చి తుద విశ్రుతయోగతపోబలంబున
న్నహుషుఁడు దేవతానగర నాయకుఁడయ్యెను విక్రమంబునన్. 326

క. ఆనహుషుఁడు సురపతియై
నానావిధ విభవమదమునం జెలఁగుచు దే
వానీకంబులు గొలువఁగ
మానితుఁడై యొక్కనాఁడు మదనాతురుఁడై. 327

క. ఇంద్రునిపట్టపు దేవిని
నిందాక్షీణాంబరమసాధ్వి నీక్షించి దయా
సాంద్రములగు వచనంబుల
దంద్రాసహితాత్ముఁడగుచు దగనిట్లనియెన్. 328

సీ. దేవి యేనఖిలవిద్వేషుల నిర్జించి
హయమేధములు నూఱునాచరించి
ప్రస్తుతింపఁగఁ దపోబలమునసురలెల్ల
వినుతింప దేవతావిభుఁడనైతిఁ
దత్కారణంబునఁదగుశచీనీవు మదగ్ర
భార్యవై వివిధసంపదలఁబొదలి
పొదువైనసంభోగ భోగసౌఖ్యంబుల
మన్మనోజవ్యథమాన్పవలయు

తే. గీ. ననినఁబౌలోమితద్వాక్యమాదరించి
బాహ్యమునకూర్మిసలుపుచు భావమందుఁ
గ్రోధవై శ్వానరార్చులు కొనలుసాగ
నమృతసూక్తులనిట్లను నతనితోడ. 329

చ. వినుమునృపాల నీవసురవీరులనోర్వఁగఁజాలి దేవతా
జనపతివై మహేంద్రుఁడని సర్వజగంబులు సన్నుతింపఁగాఁ

బనుపడిగోత్రభేదనుని పట్టము నేలఁగఁబూనినప్పుడే
నినువరియింప యుక్తమగు నేర్పననాకుఁ దలంచిచూడఁగన్. 330

చ. కలదికనొక్కమాట గుణగణ్యుఁడవై శిబికాంతరంబునన్
వలనుగనుండి దేవముని వాహ్యుఁడవై సురకాంతలెల్ల నిన్
గొలువ మదీయగేహమునకున్ జనుదెంచితి వేని యప్పుడు
జ్జ్వలమతినై వరింతు నిను సంశయమేలనృపాలనాపుడున్. 331

వ. అనిశచీదేవిపలికినవాక్యంబులకుసమ్మతించి నహుషుండు వశిష్ఠాది మునివరులరావించి తద్భుజగృహీతంబగు రత్నశిబికామధ్యంబున సమాసీనుండై వివిధభూషణాంబరగంధపుష్పంబులుధరియించి సకల దివిజబృందంబులుపరివేష్టింప నప్సరోగణంబులుభయపార్శ్వంబుల సందడిలుచునేతేర దుందుభినాదంబులుచెలంగ స్వర్గపురరాజమార్గంబున నతిముదంబుననేతెంచునెడ నమ్మునులు నిర్భరభారంబున శ్రమంబునొందియుం జనుచుఁదత్పదతాడితులై. 332

క. కోపంబున మునులందరు
శాపంబిడిరంత నహుషజనపతిఫణిరా
ట్రూపంబునొంది ఘనవరి
తాపంబునఁజనియెనింద్ర తరుణిహసింపన్. 333

ఇంద్రాగమనము

సీ. అంతమునీంద్రు లత్యంతహర్షమునొంది
మానసవరసరోమధ్యమునను
గమలనాళాంతరగతుఁడైన శక్రుని
గురునిచే రావించి కూర్మి మెఱయఁ
హయమేధమునవిష్ణు నారాధనముసేయఁ
దత్పుణ్యమున దేవతావిభుండు
జలజాప్తుఁగని మంచుతొలఁగుచందంబున
నృత్యహత్యోద్భవవిశికలుష

తే. గీ. ముక్తుఁడై యేలె త్రిదివంబు మొనసియున్న
వేడుకలఁబొందిపౌలోమితోడఁగూడి
సకలసురముని మోదప్రశస్తరత్న
కాంతిరంజిత పాదాబ్జ కలితుఁడగుచు. 334

ఇంద్రుం డశ్వమేధంబొనర్చుట

క. ఘనమగునింద్రుని విజయం
బును దత్కలుషోపశమనమును వేడ్కజనుల్
వినినఁబఠించిన విజయం
బున విశ్రుతులగుచుఁగీర్తిఁ బొందుదురధిపా. 335

వ. అనియిట్లు మహేంద్రువిజయంబును వృత్రాసురవధ సంభవంబగు తత్పాతకంబును నశ్వమేధమూలంబుననడఁగుటయు వినిపరీక్షిన్మహీవల్లభుండిట్లనియె. 336

సీ. కలితరజస్తమోగుణ సంయుతుండగు
వృత్రాసురునకు భావించిచూడఁ
భగవంతుడగువిష్ణు పదసరోజంబుల
నిశ్చలభక్తి యేరీతినొదవె
శుద్ధసాత్వికులైన సురమునీంద్రులకును
హరిపదధ్యానంబు తిరముగాదు
మహినిజీవులయందు మనుజులధికులు వార
లందు గొందరుముక్తికాససేతు
గీ. రట్టిమోక్షార్థి శతసహస్రాంతరమున
యత్న మొనరించునొకఁడు తత్ప్రాప్తికొరకు
నామహీశిద్దకోట్లలోనైన దలుచు
తోయజోదరభక్తుఁడు దుర్లభంబు. 337

చ. సురపతిమీఁదబౌరుషము చూపుచుఘోరరణాంతరంబునం
మరువక శ్రీవిభుండలచు మానసపద్మములోనపాపసు
స్థిరుడగుః వృత్రుడేతపము చేసెను తొల్లి ముకుందుపాదపు
ష్కరయుగభక్తిగల్గుటకు కారణమెయ్యది భూసురోత్తమా. 338

చిత్రకేతూపాఖ్యానము

వ. అనిపలికిన రాజునకుమునివరుండిట్లనియె. ఓరాజవల్లభా ద్వైపాయ
నాదులవలనం వినంబడినవృత్రునిపూర్వవృత్తాంతంబు చెప్పెద
నాకర్ణింపుము. 339

సీ. సార్వభౌముఁడనంగ జగతిపై నుదయించె
చిత్రకేతునృపాలశేఖరుండు
అతఁడుశూరసేనాహ్వయ దేశాధి
నాథుఁడై కీర్తిధనంబుగలిగి
సాహస్రి దశసహస్రవధూసమేతుఁడై
యుర్విపాలింపుచునున్నయంత
రూపవయోజన్మరూఢి దివ్యైశ్వర్య
సంపదల్ గల్గియు సంతులేక
గీ. చింతబొరలెడి తన్మహీకాంతునకును
చక్కఁదనమును దెలివొందుసతులు చెడని
సంపదయు నిఖిలరాజ్యంబు సౌఖ్యమునకు
కారణంబులుగావయ్యె కౌరవేంద్ర. 340

ఉ. అంతటఁగొంతకాలమున కాంగిరసుండరుదేర తన్మహీ
కాంతుఁడు భక్తితో మునిశిఖామణికర్ఘ్యమొసంగి నిర్గత
శ్రాంతునిజేసి సత్ప్రియతల్ సాంగముగానొనరించి దివ్యసౌ
ధాంతరమందురత్నకలితాసనుగా నియమించి యిట్లనున్. 341

క. మునివరభవదభినవపద
వనరుహ రేణువుల మద్భవనముపవిత్రం
బునునొంది మంగళశ్రీయ
మునునైశ్వర్యాభి పూర్ణమునునైతనరెన్. 342

వ. అనివినయంబుగాబలికిన చిత్రకేతునకు మునివరుండిట్లనియె. 343

సీ. భద్రింబెనీకు నీప్రజలకునరపాల
తత్త్వజాగుప్తుఁడై ధరణివిభుఁడు

సంతసతంబునుప్రజా సమ్మతుండై యున్న
విత్తసత్కీర్తులు వెలయుచుండు
ప్రజలభృత్యులజనపతులను మంత్రుల
బాలించు నెవ్వడు భక్తితోడ
వారలుభూపాలవర్తులై చరియింత్రు
నుభయసమ్మతమున నుర్విబయిదవు

గీ. ధీవరాక్రాంతమగునట్టి త్రిజగమెల్ల
బొలుపుతోడుత పాలించు బూనునపుడు
ఆత్మనొరుచేతనైన తనంతనైన
బ్రీతిబొందదు చిత్తవిభిన్నునకును. 344

గీ. వెలితిగానికామములబొంది సత్కీర్తి
నలరిఘనుడవైనయట్టినీవు
సంతసంబుమాని చింతాభరంబున
దెరలుచున్ననీదు తెరగుచెపుమ. 345

చ. అనిననృపాలుడిట్లనియె నామునితోడుత భూసురేంద్ర పా
వనమతులై తపోమహిమ వర్ణితులై ధరయోగమార్గ వా
సనలగతాఘులై సుజనసన్నుతులైన మహాత్ములం
మనుజశరీరమధ్యగత భావమెరుంగరె తత్వనిష్ఠులై. 346

శా. ఆనంజెప్పెద మీయనుజ్ఞను మదీయాంతర్విచారంబు ని
త్యానందాకరలోకపాలనుత సర్వైశ్వర్యముల్గల్గి కాం
తానేకప్రియభర్తనైన నను నిత్యానందసత్పుత్రసం
తానాత్మన్గానరింపవేడెద దయాదాక్షిణ్యపాథోనిధీ. 347

క. కామముముక్తువుతృష్ణల
వేమరుబాధింపబడినవిధమున సంప
త్సామగ్రిచేతమిక్కిలి
నామదిశోకంబునందినది మునినాథా. 348

క. అతులితముగ నాదవిస్ఫు
తతిచేమత్పూర్వులెల్ల తరియింతురు నా
ఘతమంబున మునిసత్తమ
చతురతనాకీతి శేయ జనుకృత్యంబుల్. 349

వ. అనియిట్లు చిత్రకేతుమహీకాంతునిచేత సంతానార్థంబభ్యర్థితుండై కృపాలుండగు నాంగీరసుండు త్వష్టదేవతాయుక్తంబగు చరువున తత్ప్రీతిగా హోమంబుచేసి రాజభామినులందగ్రమహిషియగు కృతద్యుతికి నాయజ్ఞశేషంబుచరువిచ్చిన నమ్మానిని యశుచియై యది భుజియించినంజూచి మునీంద్రుండిట్లనియె. నరపాలకవినుము దుఃఖప్రదుండగునొక్కపుత్రుండు సంభవించునని చెప్పి యాంగీరసుం డరిగెనంత. కృతద్యుతియువహ్నివలనకృత్తికలు గర్భంబైనమాడ్కి చెరుప్రభావంబున నిర్భరంబగుగర్భంబుధరించి శుక్లపక్షచంద్రుని చందంబున ప్రతిదినంబునకు కళావిశేషంబున వృద్ధిపొందుచున్నం జూచి యమ్మహీవల్లభుండు సంతసంబున నుప్పొంగుచుండెనంత. 350

క. నవమాసంబులు నిండిన
నవనీశుని దేవిగాంచె నతిముదమున మా
నవనాథులెల్ల బొగడగ
నవమన్మథసదృశుకమల నయనుకుమారున్. 351

వ. ఆసమయంబున- 352

క. తనసతి తనయునిగనెనని
వినినరపాలుండుహర్ష విపులితుడగుచున్
జనులకునిచ్చె నభీష్టము
లొనరగవైభవములొదువ నుజ్జ్వలమతియై. 353

వ. ఇట్లు మేఘునిచందంబున యాంచకులకిష్టార్థంబులొసంగి చిత్రకేతుమహీవల్లభుండు స్నానాదికృత్యంబులాచరించి మిత్రసమేతుండై యాకుమారునకు జాతకర్మాదులొనర్చుమని మహీసురులకు హిరణ్యంబును వస్త్రంబులును నాభరణంబులును హయంబులును గజం

బులును ధేనువులనిచ్చి కుమారునకునాయుష్యంబులుగలుగ నాశీర్వాదంబులుచేయించె. నంత నారాజునకు నిత్యనూతనంబై పేదకు విత్తంబుమీఁది మోహంబుమాడ్కి తనయునందేకూర్మిబహుళంబయ్యె నయ్యెడ సవతులు సంతానంబులేని పరితాపంబున నుండిరి. పుత్రవతియగు కృతద్యుతియందే మనంబుచేర్చి నరపాలుండుండె
మరియును- 354

క. తనయుని నుపలాలింపుచు
ననయముసంతోషసహిత యగునక్కాంతన్
గనుగొనిసవతులు కోపం
బున గనలుచునుండిరొక్క బుద్ధిదలచియున్. 355

చ. తనయునిగన్నదంచును కృతద్యుతియందెమనంబుచేర్చి భూ
జనపతి తత్ప్రియాంగనకు సఖ్యమొనర్చుచునున్నవాడునై
మనలపరిత్యజించెనని మానినులెల్లను మత్సరంబునం
గొనకొని యత్తనూభవునకుం గరళంబిడిరేకచిత్తలై. 356

గీ. యిట్లువిషముపెట్టు టెరుగకయాదేవి
సుతుడు నిద్రపోవుచున్నవాడు
వనితవానినెత్తుకొని వేగతెమ్మని
పలుకవేగదాది బాలుగదిసి. 357

ఉ. ఆగరళంబుగ్రోలి శయనాంతరమందు తదాత్మజుండు ని
ద్రాగమసౌఖ్యసంహితుక్రియం మృతిబొందిన దాసిజూచి యా
లాగునృపాలదేవికి విలాపముతోడుత విన్నవింప త
ద్భాగవతప్రమాదగతి ధారుణిపైబడి మూర్ఛచెందుచున్. 358

వ. ఇట్లశనిసమానంబగుదాసివచనంబాకర్ణించి మూర్ఛనొంది కొండొకతడవునకు తెలిసి మృతుండైనకుమారునీక్షించి కరయుగంబున నురతాడనంబుశేయుచు నశ్రుధారాపాతంబున కుంకుమాంకితంబగు కుచమండలంబుదడుపుచు పుత్రశోకమహాసముద్రంబున నిమగ్నయైవాపోవుచు నవపుష్పమాలికావిరాజితంబగు కబరీభారంబు

తురుమువిడి పర్యస్తంబై పరిభ్రమింప మొదలుపెట్టుచున్న సమయం బున చిత్రకేతుండు దాసీముఖంబున కుమారుమరణం బాకర్ణించి నయ నంబుల నశ్రుధారాకణంబులొలుక యంతఃపురంబునకరుగుదెంచి నిశ్చేష్టితుండగు బాలునింగనుగొని పుత్రశోక వేదనంబున సంతప్త మనస్కుండై హితులు పురోహితులు నమాత్యులు భృత్యులు బరివేష్టింప దత్కృతంబగు స్నేహానుబంధంబున నతినిబిడంబగుదుఃఖం బున గద్గదకంఠుండై విలపించుచున్నంజూచి తత్కామినులు బాం హ్యాకపటదుఃఖంబున దుఃఖితులచందంబున యెలుంగెత్తియేడ్చుచు కుమారునిశయనప్రాంతంబుననుండిరప్పుడు. రాజభామిని తనయుని దేహంబు నిజకరముననివురుచు నిట్లనివిలపించె. 359

సీ. ఓచిన్నిపాపడ ఓముద్దుతనయుండ
నన్నుపేక్షింపంగ న్యాయమగునె
అత్యంతశోకాపహతుడై నయట్టి నీ
తండ్రినివిడునంగ దగునెనీకు
నీచేతభవదుఃఖ నిబిడగాఢతమంబు
దాటెదమనిపూనదప్పదోచె
ఖేలనంబునకునై బాలకులున్నారు
రాజకుమారనీ రాకగోరి

గీ. తెలసిమేల్కొనుమిక నేల దీర్ఘనిద్ర
కమలశోభావిరాజమైవిమలమైన
నయనయుగ్మంబుదెరచి యానందమొదువ
నవ్వుమోమున వీక్షింపునన్ను పుత్ర. 360

వ. అనియిట్లు బహుప్రకారంబుల పుత్రమోహంబువిడువంజాలక రాజ దంపతులు కుమారునిశయ్యాసమక్షమందుననున్నయెడ, నారదసమే తుండై నాంగీరసమునీంద్రుడేతెంచి యిట్లనియె. 361

సీ. వినుమురాజేంద్ర యెవ్వనిగూర్చిశోకార్తి
వశుడవై యిట్లున్నవాడ వనఘ

యీ బాలకునకు నీ వెవ్వరు గతవర్త
మానకాలములందు మాన వేంద్ర
ఘననదీజలవేగమున వాలుకంబులు
యోగవియోగంబు నొందినట్లు
కాలంబుకతన యోగవియోగసహితులై
దేహస్థజీవులు దిరుగుచుందు
గీ. రిట్లు భూతములు భూతప్రహితములగుచు
నుండు నీశ్వరమాయాగుణోల్బణమున
నీసమాగతజనులెల్ల నేను నీవు
సముల మాగతకాలప్రశస్తమునకు. 362

వ. మఱియు, భూతభవిష్యత్కాలంబులందు జీవునకు జన్మమృత్యువులు సమంబగు సర్వభూతాంతర్యామియగు పరమేశ్వరుండు భూతంబుచేత భూతంబులు సృజించు. దద్రక్షణవినాశంబులకుం గారణంబై యతం డాత్మసృష్టంబులై యస్వతంత్రంబులైన వ్యాపారంబుల బాలుని చందంబున నపేక్షితుండై వర్తించు బీజంబులవలన బీజంబులుత్పా దంబులగుమాడ్కి దేహంబులవలన దేహంబులు జనియించుఁగాన దేహంబువలన దేహిసముత్పాదితుండుగాఁడు. వస్తువునకు జాతి వ్యక్తిభేదంబు లేర్పఱుపరానిచందంబున దేహి దేహవిభేదంబు లెఱుంగరాదు. అగ్నికి బాహ్యవిక్రియంబులు నిరీక్షితంబులు గాని చందంబున జన్మంబును నాశంబును వృద్ధిక్షయంబులును గ్రియా ఫలంబును ద్రష్టకు ధర్మంబులై తోఁచు. నవి దేహసంయోగంబున నాత్మగుణంబులై పర్యవసించునదిగావున మనోమాత్రంబులగు నహంకారమమకారవయోరూపవికారంబులనడంచి సకలదుఃఖనివా రకుండగు వాసుదేవాద్యనంతనామంబులుంగల శ్రీ జగన్నాథదేవుని యందే మనంబుఁ జేర్చి బాహ్యదుఃఖంబులు విడువలయునని పలికినఁ దద్వాక్యంబులాకర్ణించి కరంబుల నిజనయనజలంబులం బ్రమార్జనం బుఁ జేసి వారితో నిట్లనియె. మహాత్ములారా, మీరెవ్వరు? మదీయ గృహంబునకవధూతవేషంబున నరుగుదెంచినారు. భగవద్భక్తులగు

మహాత్ములు భూతలంబున గామ్యబుద్ధులగు మనుజులకు జ్ఞానోప దేశంబు సేయుకొఱకు సంచరింతురు. కుమారుండును, నారదుం డును, ఋషభుండును, నాంగీరసుండును, దేవలుండును, నసితుం డును, వ్యాసుండును, మార్కండేయుండును, గౌతముండును, వశి ష్ఠుండును, గపిలుండును, బాదరాయణుండును, దూర్వాసుండును, యాజ్ఞవల్క్యుడు, జాతుకర్ణుండును, బతంజలియు, వేదశిరుండును, బోధ్యుండును, బంచశిఖుండును, హిరణ్యనాభుండును, గౌసల్యుం డును, శ్రుతదేవుండును, ఋతధ్వజుండును మొదలైన మహాత్ము లజ్ఞులకు జ్ఞానోపదేశంబు సేయుకొఱకు సంచరింతురు. అజ్ఞానంబున మూఢబుద్ధిసహితుండవై పుత్రశోకంబునం గుందుచు మోహమహా సముద్రంబున నిమగ్నుండవగు నాకు జ్ఞానదీపంబు నుపదేశింపవల యునని పలికిన నాంగీరసుండిట్లనియె- 363

గీ. ఏను నీకు నాత్మజేప్టి గావించిన
మౌని నాంగిరసుఁడ మానవేంద్ర
యితడు నారదుండు చతురాననోద్భవుఁ
డఖిలలోకవంద్యుఁ డార్యచరిత. 364

చ. ఘనమగు పుత్రశోకమునఁ గందుచు మోహమహాసముద్రమం
దనయము లజ్జితుండవగునట్టి నినుం గరుణింపఁజాలుచుఁ
జనపున నేగుదెంచితిమి సంతసమొప్పఁగ నీగృహాంతరం
బునకును మానవేంద్ర పరిపూర్తిగ నిత్తుమభీప్సితార్థముల్. 365

క. కొడుకుల నతివిభవంబునఁ
బడసిన మానవుల హృదయ భవతాపము నే
డెడపక భోగ్యంబయ్యెను
పుడమిని గననీకు లోకపూజ్య చరిత్రా. 366

సీ. ఈరీతిననుఁ బుత్రదారమోహాదులు
బహువిధైశ్వర్యసంపదలు రాజ్య
బలము లమాత్యభృత్యులు సుహృజ్జనములు
శబ్దాదిసుఖములు చంచలంబు

లతిలలితస్వప్న మాయామనోరథములై
గంధర్వనగరంబు కరణినున్న
యది యర్థములఁబాసి యాలోకసక్రియా
రహితంబులై యుండు బహువిధముల

గీ. ద్రవ్యమును గ్రియయుజ్ఞానంబు తగులమైన
దేహ మొసరించు క్లేశంబు దేహికెపుడు
నదియుఁగావుననీవు పుత్రార్తిఁబుద్ధి
మానిభజియింపు శాంతంబు మానవేంద్ర. 367

వ. మఱియు దేహి సమ్యగ్జ్ఞానసమేతుండై గతికాలసుఖదుఃఖంబులును వర్తమానకాలంబును సంపన్నమాయారూపంబులుగా నెఱిఁగి నయనవనిమీలనోన్మీలన లక్షణంబులయందును విశ్వంబునకునసద్భావ సద్భావంబులు నిర్ణయంబులుచేసి సర్వంబునునిత్యంబుగాఁ దలంచు నజ్ఞుండు నిజదేహంబునాశంబునొందించునని యెఱింగియు మాయా మోహితుండై పుత్రదారాదిమర్త్యోహవశుండై సంసారవికారరూప సుఖంబులు నిత్యంబని అంగీకరించునట్టి దుర్బుద్ధివికారంబు విసర్జించి యుండిన- 368

గీ. ఒక్కమంత్రరాజ ముపదేశమిచ్చెద
మదిపఠించు నీకు నచ్యుతుండు
సప్తరాత్రములకు సాకారమునవచ్చి
వాంఛితంబులిచ్చు వసుమతీశ. 369

క. శ్రీమానినీశు పదములు
ప్రాముఖ్యతఁబూజచేసి భవముఖ్యులు తా
రేమహిమను దెలిసిరి నీ
వానుహిమనుబొందువాఁడ వనఘచరిత్రా 370

వ. అనియివ్విధంబున జ్ఞానపూర్వకంబులగు సాంత్వనవచనంబులనమ్మహీకాంతుని ననునయించి దేవమునీంద్రుండు ప్రత్యయంబుకొఱకు నిర్జీవంబగు రాజకుమారక శేబరంబుచూచి త్యక్తదేహుండైన జీవునినాకర్షించి యతనితోనిట్లనియె 371

మ. ఇదె మీతల్లియుఁ దండ్రియున్ వసుధపై నీక్షింపరానట్టి దుః
ఖదవాగ్నిం బడి కుందువారిచట శోకంబంది నీబాంధవుల్
వదనాబ్జంబులు గందభూమినులు పెన్వాపోవుచున్నారు జీ
వదయాపూర్ణుఁడవై వసింపుము శిశువ్యాసన్న దేహంబునన్. 372

క. ఈరాజసుతుని దేహం
బారయ్యాఘనాక్రమించి హర్షముతోడన్
ధారుణి యేలుము జనకుని
గారాబగుపట్టి నగుచుఁ గ్రమమున జీవా. 373

క. అనిపలికిన మునివరుతో
ననియెను జీవుండు నో మహాత్మక జగమం
దున మీకు నెఱుఁగవలసిన
పనిగల దే యొకటియైన భావింపంగన్. 374

శా. పారంపర్యములైన కర్మములచే బద్ధుండనై ధాత్రిలో
దారాపత్యధనాప్తమోహమున నత్యంతంబు మత్తిల్లి యే
నారాఘిన్ వెసదాల్చుజన్మములసంఖ్యాతంబు లబ్బినచో
నీ రేజన్మము తల్లిదండ్రులట భావింపన్ మునీంద్రోత్తమా. 375

వ. మఱియు జీవుండు కర్మసంగతుండై దేవతిర్యఙ్మనుష్యాదియోనుల యందు సంభవించి వారలకు బాంధవుండును మధ్యస్థుండును నుదాసీనుండును మిత్రుండును శాత్రవుండునునగుచు సువర్ణామలగు నర్థంబులువ్యవహారమార్గంబున నానాత్వంబునొంది పుణ్యారూపంబు లగునట్లు దేహి నానావిధయోనిముఖంబుల సంభవించి బహురూపాకారింతుండై వర్తించు నిత్యంబగునర్థసంబంధంబు మానవాదుల యందనిత్యంబై కానంబడు నెవ్వనికి నెంతపర్యంతంబు సంబంధప్రాప్తి యగు నతనికినంతపర్యంతంబుమమత్వంబునిలిచియుండు. నిట్లు యోని గతుండగుజీవుండు నిత్యుండై యహంకారరహితుండై యుపలబ్ధ మాత్రుండై యుండి సూక్ష్మాకారంబున సర్వాశ్రయుండై ప్రవర్తించు సప్పురుషుఁడు నిజమాయాగుణంబులచేత విశ్వాత్మల

సృజియించునతనికి బ్రియుండును నప్రియుండును లేఁడు. నతండొక్కండయ్యు కర్తృగుణపోషణంబులనీక్షింపుచుఁ దద్గుణదోషంబులంజెందక మధ్యస్థభావంబునఁ బరాపరధర్మనుండై వర్తించు. నట్లగుటంజేసి జీవునకు దేహసంబంధంబు దేహియెడ మూత్ర, పురీష, శుక్ల, రక్త, మద్యాస్థినిర్మితంబై సంతతాపాయసమేతంబగు నీబాలుని కళేబరంబునందు రోయకనిలువందగునేయని పలికి యాజీవుండు స్వేచ్ఛావిహారంబుననరిగె. నంతనరపతియును దదీయబాంధవులును నాజీవునివచనంబులాకర్ణించి శోకంబులుమాని యాకుమారునకుఁ బారలౌకికకర్మంబు లాచరించిరంత. బాలహంతలైన యారాజకాంతలు సిగ్గునంబరితాపంబునొందుచు బ్రాహ్మణనిరూపితంబులగు వ్రతంబుల శిశుహత్యాదోషనివారణంబుగాఁజేసిరి. తదనంతరంబ చిత్రకేతుండును బంకంబులవలన వెలువడిన గంధగజేంద్రంబుచందంబున సంసారమహాంధకూపంబునలన వెలువడి యాత్మజ్ఞానసమేతుండై యామునీంద్రులతోడంగూడి కాళిందీతీరంబునకు నరుగుదెంచి తత్పుణ్యజలంబుల స్నానాదిక్రియలఁదీర్చి పులినాంతరంబున సమాసీనుండై నారదాంగిరసులకభివందనం బాచరించి యిట్లనియె. 376

గీ. గురువులేక శాస్త్రగోచరార్థములెల్ల
ప్రజ్ఞచేతఁ దెలియఁ బలుకరాదు
గురుకటాక్షదృష్టి కొమరొప్పఁగలిగిన
వాఁడు ముక్తిఁబొందువైభవమున 377

క. గురువులుమీరు మహాత్ములు
పరికించిమదీయ వివిధపాతకహరమై
పరలోకసాధ్యమగు సు
స్థిరధర్మములానతిండు దృఢమగు వేడ్కన్. 378

వ. అనిన నారదుండిట్లనియె. 379

క. గురువేదైవము జగమున
గురువాక్యముముక్తిమార్గఁ గోచరమగుఁ ద

ద్గురునిందసేయు కుమతులు
పరువడి యమసదనమునకుఁ బాఱెదరనఘా. 380

గీ. సకలవేదశాస్త్ర సమ్మతంబగునట్టి
గుప్తమార్గమొకటి కుదురుపఱచి
వేడ్కతోడనీకు వివరించిచెప్పెద
నాదరింపవలయు నమలచరిత. 381

సీ. భక్తితోనెందైన భావించికొలిచిన
భక్తులకచ్చోటఁ బ్రకటమగును
సర్వసంపూర్ణుండు సర్వాంతరస్థాయి
సర్వసంవేద్యుండు సర్వసముఁడు
సర్వవేదస్తుత్య సత్స్వరూపకుఁడును
రక్షితభువన విభ్రాజితుండు
సనకాదియోగి హృత్సరసిజాంతర కర్ణి
కామధ్యనిలయుండు కార్యవేది
గీ. భానుశతకోటితుల్య ప్రభాసమేతుఁ
డబ్జసంభవ భవ మహేంద్రాదివిభుడు
సన్నుతానేక గుణసముజ్వలుఁడు విష్ణుఁ
డతనిఁ దలపుము హృదయమధ్యంబునందు. 382

క. ఆదేవుఁడు త్రిజగములకు
నాదియు నంతంబునగుచు నఖిలజ్ఞుండై
పాదుకొని సర్వజీవుల
లోఁ దార్కొనియుండు హృదయలోకితుఁ డగుచున్. 383

వ. మఱియు కర్మయోగంబును ధ్యానయోగంబును భక్తియోగం
బును నను నుపాయత్రయంబు తత్ప్రాప్తికికారణంబగు నందు నిజ
కులోచితధర్మంబులు సేయుచు ఫలవాంఛారహితుండై భగవత్ప్రీ
తిగా నాచరించునది కర్మయోగంబు. నిజమనఃపద్మంబున నభ్యాస
యోగంబున లక్ష్మీవల్లభుని సాకారరూపదర్శనంబు ధ్యానయో

గంబు. శిలాదారుమయంబులైన ప్రతిమావిశేషంబులయందు కౌస్తుభాభరణుని నావహించి యందుఁ బూజాదియోగంబులు పురికొల్పుట భక్తియోగంబు నందభ్యాసమూలంబునఁ జిత్తంబు తదాయత్తంబుచేసి బాహ్యంబునుమఱచిన మానవుండు వైకుంఠప్రాప్తుఁడగునని మఱియునిట్లనియె- 384

సీ. ఓంకారపూర్వక యుక్తంబుగా వాసు
దేవాయ భగవతేధీమహియని
తొలిఁ దొలిఁ బలికి ప్రద్యుమ్నున కనిరుద్ధ
సంకర్షణున కతిశాంతునకును
విజ్ఞానమాయాది కజ్ఞానహారునకు
సతతమహానంద సంయుతునకు
నిశ్చలాత్మారామ నిరవద్యహృదయున
కతినిర్మలున కనంతాదినామ

గీ. కీర్తనీయునకును హృషీకేశునకును
దెలియవినివృత్త సద్వైతదృష్టినుతున
కాత్మహర్షానుభూత్యర్థమై షడూర్మి
రహితునకు మ్రొక్కెదను రమారమణునకును. 385

సీ. అద్వితీయాకృతి నలరివాక్యాగోచ
రాత్ముఁడయ్యును మనోధ్యాన గమ్యుఁ
డవ్యక్తనామరూపాది సమేతుఁడు
సదసత్పరవ్యక్త సంయుతుండు
నగు నేమహాత్మునియందు విశ్వములెల్ల
మృద్వికాసంబులు మృద్గతంబు
లైనచందంబున నవ్యయస్థితి జన్మ
ములఁబొందు నిందిృయబుద్ధిహృదయ

గీ. ములును బ్రాణములెఱుఁగ నేమూర్తివిధము
లాకసమురీతి భువన బాహ్యాంతరములు

సంతతానందమూర్తియై సంక్రమించు
నాహృషీకేశుఁడగు విష్ణు నభినుతింతు. 386

గీ. యత్నమున నభ్రిత ప్తలోహంబుమాడ్కి
బుద్ధిదేహేంద్రియ ప్రాణములు మనంబు
తదగ్రిమానాయకాంశ విధంబులగుచు
సర్వమర్మాంతరంబుల సంచరించు. 387

వ. అనియిట్లు పుండరీకాక్షుని సన్నుతించి మఱియునుం బ్రణవపూర్వకంబుగా భగవన్మహాపురుష మహానుభావ మహావిభూతిసమేత భావ సకలసాంత్వతనికరపరివృఢకమలకుట్మలోపలాలిత చరణారవిందయుగళ పరమపురుష నిత్యలక్ష్మీనివాస నీకు ననంతంబులైన సాష్టాంగదండంబులాచరించెదనని యివ్విధంబున మంత్రిపూర్వకంబుగా మహాపురుష మహానుభావ మహావిభూతిసమేత భావన సకలసాంత్వతనికర పరివృఢకమలకుట్మలోపలాలిత చరణారవింద యుగళ విష్ణుస్తుతియొనర్చిన నమ్మహాపురుషుండు నీకు సప్తరాత్రంబులకుఁ బ్రత్యక్షంబగునని చిత్రకేతునకు నుపదేశించి నారదుండు నాంగీరసుండును బ్రహ్మలోకమునకరిగిరంత. జిత్రకేతుండును మనోవికారసంభవంబగు సంశయంబుమాని వాయుభోజనుండై యేకాంతంబునవసియించి నిజమనఃకంజంబున శంఖ, చక్ర, గదా, శార్ఙ్గాది దివ్యాయుధధరుండును శ్రీవత్సకౌస్తుభాంకితుండును, రత్నకిరీట హారకటకాంగుళీయ దివ్యభూషణభూషితుండును పీతాంబరాలంకృతుండును, మణిమయసింహాసన సమాసీనుండును నైన లక్ష్మీవల్లభుని విమలాకారంబు ధ్యానయోగంబునఁ బ్రత్యక్షంబగు నట్లుగాఁ జూడుకొల్పి నారదోపదిష్టంబగు తన్మంత్రరాజంబు పఠియింపుచుఁ దద్విద్యాప్రభావంబున సప్తరాత్రంబులకు విద్యాధరత్వంబునొంది కొన్నిదినంబులకు మనోవేగంబున శేషశయనునుండగు శ్రీవల్లభుని సమక్షంబునకరిగి- 388

శా. ఆలోకించెను జిత్రకేతుఁడచటన్ హారాంగుళీయాంగద
వ్యాలోలామలరత్నకుండల కిరీటాదిస్ఫురద్దివ్య భూ

షాలంకార విరాజితున్ విమలవక్త్రాబ్జున్ సువర్ణాంబరుం
భూలక్ష్మీ లలనావిలాసితకృతున్ బుణ్యాలయున్ మాధవున్. 389

క. హరిఁ గనుఁగొని విమలాంతః
కరణుండై యంత నతఁడు ఘనముగఁ బులకాం
కురములు తనువున నొదవఁగఁ
గరములు జోడించి భక్తికలితుండగుచున్. 390

క. రభసంబునఁ దద్విష్ణున
కభివాదనమాచరించి యతినమ్రత వా
గ్విభవమునఁ సన్నుతించుచు
నభిముఖుఁడై నిలిచి యిట్టులనియె నృపాలా. 391

శా. సర్వేశా జగతీధవా గుణనిధీ సంసారవిచ్ఛేదకా
సర్వైశ్వర్యవిరాజితామరచమూ సంసేవ్యపాదాంబుజా
సర్వార్థప్రియదర్శనా కమల సంజాతాది వాగ్వర్ణితా
సర్వాతీత మునీంద్ర మానససరోజాతాలయా మాధవా. 392

సీ. అజితుఁడవై నీవు విజితాత్ములగు సాధు
జనుల చే జితుఁడవు సంతతంబు
నిష్కాములగువారు నెలకొని సేవింప
నిత్తువు వారల కీప్సితార్థ
మీశ్వరజగధీశ విశ్వోద్భవస్థితి
హనన కారణమైన యనఘ నీకు
నజ్ఞులాగతవై భవాదుల నాత్మలో
నెఱుఁగక వాదావసరములందు
గీ. నీశ్వరాభావమతముల నిచ్చగించి
మహిని బ్రత్యక్షమేక ప్రమాణమగుచు
వాదములు చేసి తుద రౌరవాదులందు
ననుభవింతురు దుఃఖంబులనఘులగుచు. 393

వ. మఱియు పరమాణ్వాది బ్రహ్మపర్యంతంబు భూతకోట్లకు నాది మధ్యాంతరవర్తివై వర్తింతువు. దేవా దశగుణోత్తరంబులైన సప్తావరణంబులచేత నావృతంబగు నిన్నెఱుంగలేక నరపశువులు విషయాపేక్షితులై కరంజ బీజంబులమాడ్కి నపవిత్రులై ముక్తిం బొందలేరు. ప్రజ్ఞలు గుణరహితుండవై జ్ఞానరూపంబవగు నిన్ను నెఱుంగలేరు. జ్ఞానులాత్మలవిలోకింతురు? అకించనులై యాత్మారాములైన మునీంద్రులు మోక్షార్థులై భవన్ముఖచోదితంబులగు భాగవతధర్మంబులాచరింతురు. సత్వాసూయావిషమబుద్ధిసమేతులైన నరులు త్వమహమ్మనెడి భేదవాక్యంబుల నంగీకరించి పృథగభిమతసమేతులై యిష్టకర్మంబు లాచరింతురు. మఱియు నాత్మకుఁ బరాపరభావంబులేదని యెఱింగి పెద్దలు దగ్ధకర్మనిరతులై భవచ్చరణారవిందంబులుసేవింతురు. జగన్నాథా భవన్నామ మంత్రశ్రవణమాత్రంబున పతితుండైనను సంసారంబున ముక్తుండగు మఱియును- 394

చ. సుర మును లానతిచ్చిన విశుద్ధభవత్కథితార్థ ధర్మసా
గరముసఁ దేలియాడి త్రిజగన్నుతమై విలసిల్లు మీపదాం
బురుహవిలోకనంబునను బుణ్యచరిత్రుఁడనైతిఁ బుండరీ
కరుచిర నేత్ర యింక నధికంబగు విన్నపమేయ్యదీశ్వరా. 395

గీ. అఖిలలోకరక్ష వాదిమ కర్తవై
దుష్టజనులకెల్ల దుర్నిరీక్ష్య
మగుచుఁ బరమహంసమగునట్టి మీకు సా
ష్టాంగ నుతులొనర్తు నంబుజాక్ష. 396

క. భూతలమెవ్వని శిరమునఁ
జాతురితోసర్షపంబు చందంబున వి
ఖ్యాతంబగు నావిష్ణుని
చేతోమార్గమునఁ దలఁతుఁ జింతితఫలదున్. 397

వ. అని యివ్విధంబున సన్నుతించు విద్యాధరనాయకుం గనుంగొని సంతుష్టుండై పుండరీకాక్షుండిట్లనియె. 398

సీ. ఉర్వీనారదమునీంద్రోక్త విద్యారూప
మునశ్రుతి చోదితమునను నీకు
విద్యాధరత్వంబు వేద్యమైనిల్చెను
సిద్ధుండవైతివి విశుద్ధచరిత
యేను భూతాకృతినెనసిన భూతాత్మ
భూతభావనుఁడనై పొదలుచుందు
మొనసిశబ్దబ్రహ్మమును ననగలయట్టి
యాది మదీయదేహమ్ముగలదు

గీ. నదిజగంబులవర్తించు నందు జగము
లతిముదంబునవర్తించు నాద్వయంబు
మత్సమాక్రాంతమగుచుండు మఱియు మత్స
రీరమనఁదగు నదియ ధాత్రీతవేంద్ర. 399

వ. వినుమింక స్వప్నసంగతుండగు పురుషుం డాత్మలోనఁ బ్రపంచంబు నాలోకింపుచుఁ దన్నెఱుంగకయుండు నిట్లుజాగరణాదులు నాత్మకు జీవస్థానంబు లివి మాయామాత్రంబులని యెఱింగి యేతద్వ్యతిరిక్తంబులుగా నన్నుం దలంపవలయునని మద్విఘ్నంబగు నాత్మకుఁ సంసారంబునందు దేహంబువలన దేహంబును మృతివలన మృతియుఁ గలుగు నాత్మపృథివిపయిం బంచభూతకరంబగుమానుష దేహంబాశ్రయించి జ్ఞానవిజ్ఞానంబులకు సంభవంబగునాత్మ నెఱుఁగక ముక్తిఁబొందలేఁడు. జ్ఞానసంగతుఁడగు దేహమందులఁబరిక్లేశంబును ఫలవిపర్యంబును దలంచి తద్ద్వయంబును తద్విహాసనంబును సంకల్పంబువలన విసర్జించి సుఖంబునకు దుఃఖమోక్షంబుకొఱకును గర్మంబులాచరించి తద్వయంబును దేహవిపర్యయంబు నెఱుంగుచు మద్భక్తుండు స్థానత్రయవిలక్షణంబై సూక్ష్మంబగు నాత్మగతి నెఱింగి దృష్టశ్రుతాంశంబులతోడి స్నేహమోహ నిర్ముక్తుండై

జ్ఞానవిజ్ఞానసమేతుండై పరమాత్మదర్శనంబున మహాస్వాయుజ్యంబు నొందు నట్లుగుటం జేసి నీవును బ్రమత్తుండవై మద్వాక్యంబులాకర్ణించి మద్భక్తుండవై సంచరింపవలయునని పుండరీకాక్షుం డానతిచ్చి యంతర్ధానంబునొందె. జిత్రకేతుండును దత్ప్రసాదంబున విద్యాధరత్వంబునొంది దేవమునిగణంబులు సన్నుతింప, నవ్యాహతబలేంద్రియసంపన్నుండై విద్యాధరసమేతుండై నానాసంకల్పప్రభావంబులగు కులపర్వతద్రోణిమధ్యంబులయందు లక్షవర్షంబులుక్రీడింపుచు లక్ష్మీకాంతుగుణంబులుగాన మూలంబున ననవరతంబున సన్నుతింపుచు నొక్కనాడు. 400

మ. సరసామాత్యవధూసమేతుఁడగుచున్ సత్పుష్పకారూఢుడై
హరిభక్తుండగు చిత్రకేతు వసుధాధ్యక్షుండు కైలాసభూ
ధరశృంగంబున సిద్ధచారణమునీంద్రవ్యాప్తరాజత్సభాం
తరసింహాసనమందుఁ గాంచె గిరిజాతాపంచబాణారులన్. 401

వ. ఇట్లు సింహాసనంబున నన్యోన్యసమాలింగితులై సభామధ్యంబున నున్న పార్వతీపరమేశ్వరులం గనుంగొని నవ్వుచు నావిష్ణుభక్తుండోఁ త్తిలి యిట్లనియె. 402

సీ. అఖిలలోకశరణ్యుఁడై శరీరులనెల్ల
ధర్మబోధకుఁడనఁ దనరుశివుఁడు
సిగ్గొకింతయు లేక యెగ్గాత్మదలఁపక
ప్రాకృతంబగు నరుపగిది నతఁడు
సభలోనఁ గామినీసహితుఁడై యున్నాఁడు
బ్రహ్మవాదియు సభాపతియునగుచు
కాముకులైన నేకాంతమందు నెకాని
సతులఁగూడరు సభాస్థలములందు
గీ. ననుచు గంధర్వపతి పుష్పకాంతరమున
బలుకు వాక్యంబులాలించి ప్రమథవిభుఁడు
నవ్వెనంతట కోపసన్నాహకలిత
యగుచుఁ బార్వతి హరునితో ననియెనిట్లు. 403

గీ. పంకజాసనాది పరమాత్మవిధులెల్ల
నాత్మ నిన్నెఱుంగరట్టిచోట
మహిని సిగ్గులేనిమముబోంట్లు శాసింప
దండధరుఁడై వీఁడు ధన్యచరిత. 404

క. హరి పాదసరసిజంబులు
నిరతంబును బూజచేసి నిందింపని యా
పరమేష్ఠిప్రముఖామరు
లెఱుఁగరటే ధర్మసరణి నెనసిన వేడ్కన్. 405

వ. అనిపలికి రుద్రాణియిట్లనియె. 406

ఉ. ఆయత బుద్ధియుక్తులగు నాచతురాననముఖ్య దేవతా
ధ్యేయపదాబ్జముల్ గలిగి దృష్టిజగత్పతి యైనశంకరున్
వేయువిధంబులం బరిభవింపుచుఁ దాన నియామయుక్తుఁడై
పాయకత్రుళ్లు నీమనుజపాలకకీటముఁ దుత్రింపుఁ డియ్యెడన్. 407

గీ. పరమమునులచేత నిరతంబుసేవింపఁ
దగిన విష్ణుపాదయుగళమందు
నిశ్చితాత్మజనిత నిర్మలంబగు భక్తి
కితఁడు నర్హుఁడెచట నెన్నిచూడ. 408

చ. అని హరుతోడఁబల్కి తదనంతరమందు హిమాద్రికన్య సం
జనిత విశాల కోపనయ నాన్వితయై త్రిజగంబు భీతిలం
జనపతిఁ జూచి యోవిగతసార సమన్విత నీవు ధాత్రిలో
నొనరెడి వేడ్కతోన సురయోనిజనింపుము దుష్టవర్తనా. 409

వ. అనియిట్లురుద్రాణి శాపంబిచ్చినఁ జిత్రకేతుండు పుష్పకంబుడిగ్గి
శంకరుసమక్షంబునకుంజనుదెంచి ప్రణామపూర్వకంబుగాఁ బార్వతీ
దేవితోనిట్లనియె. 410

సీ. అంబ నీచే శాపమందితి పుదాత్రిజ
పూర్వనిర్దిష్ట సత్పుణ్యపాప
ఫలము లెచ్చటనైనఁ బ్రాప్తంబులగుఁ గాని
తప్పింప శ్రీమికినైనఁ దొలఁగవెందు
సంసారసక్తుఁ డజ్ఞానావృతాత్ముఁడై
సుఖదుఃఖములఁ బొందు సాదిదివిూప
తద్ద్వయంబునకు నాత్మయును నన్యుండును
కర్తలుగారు దుష్కర్మ మనుజుఁ
గీ. డాపరాత్మకుఁ దత్కర్మమనుచు మదిని
నిశ్చయముగాఁగఁ దలఁపుచు నేర్పుదప్పి
యరయఁ గర్తృత్వకారణత్యక్త శక్తి
రహితుఁడై యాత్మసాక్షి మాత్రమున వెలయు. 411

వ. మఱియును గుణప్రవాహంబగు నిందు ధరురాశిశాపంబు నను గ్రహంబును నరకంబును సుఖంబును దుఃఖంబునను నివి భగవద్భక్తులకు సమంబే కాని భేదంబు లేదు. భగవంతుండగు పరమేశ్వరుం డద్వితీయుండై భూతంబుల సృజియించి వానికి బంధమోక్షంబులైన సుఖదుఃఖంబుల గల్పించి సాక్షియై వర్తించు జాతిబంధరహితుండై సర్వసముండై నిరంజనుండైన దేహికి ననురాగంబును రోషంబునుం గలుగునే. యట్లయినజీవులకు శక్తివిసర్గంబు సుఖంబుకొఱకును నహితంబుకొఱకును మృత్యుజన్మంబులు బంధమోక్షంబుల కొఱకును శరీరుల సంసారబంధకల్పనంబులగుఁ గాత్యాయినీ శాపవిమోచనంబుకొఱకు నిన్ను స్తుతియించెద. నావలని యపరాధంబు క్షమియింపుమని చిత్రకేతుండు రుద్రునకుఁ బార్వతీదేవికి నుతు లొనర్చి క్రమ్మఱ నిజవిమానారూఢుండై చనియె. నంత శంకరుండు దేవ దైత్య గంధర్వ సిద్ధ విద్యాధరులు వినమృడానితో నిట్లనియె. 412

క. ఘన శంకా విరహితమతు
లనృత పరాఙ్ముఖులు నిస్పృహాత్మ మహాత్మా

భినుతులు నగు హరిభక్తుల
వినయవివేకములు గంటె వేగిరి తనయా. 413

క. నరక స్వర్గంబులయెడ
సరసతఁ దుల్యార్థబుద్ధి సంయుతులగుచున్
హరిభక్తులైన మనుజులు
వెలువరు దామెందునైన విశ్వములోనన్. 414

వ. మఱియు దేహులకు దేహసంయోగంబున ద్వంద్వంబులైన యీ
శ్వర మాయాకల్పితంబులైన సుఖదుఃఖంబులను జన్మమరణంబు
లను శాపానుగ్రహంబులను సమదర్శనుండయ్యె. నిట్టిది విష్ణుభక్తు
లకు సాధ్యంబగు సంభవించునవి స్వప్నకీలితంబులుగాఁ దలంచు
జ్ఞానవైరాగ్యవీర్యంబులంగలిగి విష్ణుభక్తిసమేతులగు మానవులకు
నవ్యాపాశ్రయంబులేదు. ఏనును బ్రహ్మయుఁ గుమారుండును
నారదుండును బ్రహ్మపుత్రులగు మునులును సురేశ్వరుండును నా
పరమపురుషుని స్వభావ గుణ వ్యాపారరూపంబుల నెఱుంగలేము.
ఆవిష్ణుండు సర్వభూతాంతర్యామియగుటంజేసి యతనికిఁ బ్రియుండు
నప్రియుండును మిత్రుండును శత్రుండును లేఁడట్లగుటంజేసి చిత్ర
కేతుండును లక్ష్మీవరునిపాదభక్తుండుగావున శాపానుగ్రహంబుల
యందు సమదర్శనుండయ్యె. నదిగావున విష్ణుభక్తినిరతులైన
మహాత్ములయెడ విస్మయంబునొందవలవదని పరమేశ్వరుండు పలికిన
వచనంబు లాకర్ణించి పార్వతీదేవి కోపంబుమాని సంతసంబునొందె
నని శుకయోగీంద్రుండు మఱియునిట్లనియె. 415

గీ. చిత్రకేతుఁడంత శివునిభామినివల్ల
శాపమంది దనుజ రూపమలర
ద్వష్టదక్షిణాగ్నిఁ దార్కొని జనియించె
విష్ణుభక్తితోఁ బవిత్రుఁడగుచు. 116

క. దనుజుండయ్యును లక్ష్మీ
వనితాధిప భక్తుఁడగుచు వర్ణితుఁడగు వృ

త్రునిచరిత వేడ్కతోడను
వినుపించితినింక నేమి వినఁదలఁతు నృపా. 417

క. ఈయాఖ్యానము భక్తిని
ధీయుతులై పఠనసేయు ధృతియుక్తులు దీ
ర్ఘాయువులఁ బొదలి శ్రీహరి
సాయుజ్యముఁ బొందువారు జగములు వొగడన్. 418

వ. అనిన శుకయోగీంద్రునకు రాజేంద్రుం డిట్లనియె. 419

క. దనుజామరు లోకవంశం
బున సంభవమంది రందు పుణ్యవ్రతమా
తను వినవలయును నేఁడుక
వినుపింపుము చిత్తమలర వివరంబెల్లన్. 420

వ. అనిపలికిన రాజచంద్రునకు మునిచంద్రుం డిట్లనియె. పృశ్నియను
పేరంగలుగు సవితృనిభామ వ్యాహృతిమయంబగు సావిత్రిని నగ్ని
హోత్రంబులను మహామఖంబులను సోమంబును జాతుర్మాస్యం
బునుగాంచె భగునిభార్యయగు సిద్ధిమహిమను విభవు నాశిషంబును
వరారోహయగు కన్యకనుంగనియె. ధాతక్రియయందు కుహూసినీ
వాలులను నగ్నిపురీష్యులను మొదలగు వారలంగనియెఁ. దద్వం
శంబున భృగువుసంభవించె. వల్మీకంబున వాల్మీకి జాతుండయ్యె.
మిత్రావరుణుల కూర్వశిసన్నిధానంబున నుద్గతంబైన నిజరేతంబుఁ
గుంభంబునం జేర్చిన దన్ముఖంబున వసిష్ఠుండును నగస్త్యుండును సంభ
వించిరి. మఱియు పౌలోమియందు దేవేంద్రుఁడు జయంతుని
ఋషభుని మీఢుష్టునిఁ గనియె. నంత నురుక్రమునకుఁ గీర్తియందు
బృహచ్ఛోకుండును సంభవించె. నతనివలన నాభాగాదులుద్భవంబంది
రందు గయాదులవయనుజంభునికూతురు హిరణ్యకశిపునకు భార్యయై
సంహ్లాదుండును, ననుహ్లాదుండును, హ్లాదుండును, బ్రహ్లాదుండును
నను నలువురుకుమారులంగనియె. వారలతోఁ బుట్టువగుసింహిక విప్ర
జిత్తివలన రాహువును, కేతుశతంబునుగనియె. నంతవిష్ణుండమృత

పానంబుసేయుచున్న యా సైంహికేయుని శిరంబు చక్రంబునఁ దుంచె. సంహ్లాదుండు దరియనుభార్యయందు పంచజనుంగాంచె. హ్లాదుండు ధర్మనియందు నిల్వల వాతాపులంగనియె. వారల నగస్త్యుండుసంహరించె. ననుహ్లాదునిభార్యయగు సౌమ్యయందు బాష్కలుండును, మహిషుండును సంభవించిరి. ప్రహ్లాదునకు విరోచనుండు గలిగె. నతనికిబలిసంభవించె. నతండు యజ్ఞసేనియందు బాణుండు మొదలుగాఁగలుగు కుమారశతంబుఁగనియె. నాబాణుండు తపోమాహాత్మ్యంబునఁ బరమేశ్వరదయాపూర్ణుండై ప్రమథగణంబులకు ముఖ్యుండై యుండె. నప్పరమేశ్వరుండు తత్పురద్వారపాలకుండై వర్తిఁచు నంత దితివలన మరుద్గణంజేకొన పంచవింశత్సంఖ్యంబు పరివర్తింపుచు వారలు మహేంద్రునకు మిత్రులై త్రిదివంబున కరిగిరని చెప్పినవిని పరీక్షున్న రేందుండిట్లనియె. 421

క. దితి సంతానం బంతయు
శతమన్యుముఖాది దేవ సంఘముచేతఁ
హతమయ్యెడిచో నిందుర్న
కతిముద మెట్లొదవె దద్గణావలిమీఁదన్. 422

గీ. అమరుద్గణంబుల మరాధినాథున
కేమి హితముచేసి రెట్టివిధిని
నానతీయవలయు నఖిలంబు హర్షింప
వినుతసత్యగణ్య మునివరేణ్య. 423

క. అని భూకాంతుఁడు పలికిన
విని యోగీంద్రుండు మునులు విస్మయమొందన్
మనమున నిశ్చలుఁడై పలి
కెను దరహాసమున లలితకేలిదలిర్పన్. 424

సీ. హతపుత్రియగు దితి యాత్మలో నొకనాఁడు
దలపోసి సంతాప సహితయగుచుఁ
బురుషోత్తముఁడు తోడఁబుట్టియుండియు నిజ
భ్రాతృహంతయుఁ బాపరతుఁడునైన

దేవనాథునిఁబట్టి తెగ వధింపగఁజాలి
ఘనపరాక్రముఁడైన తనయు నొకనిఁ
గాంచెదనని పూని గర్వప్రతిజ్ఞతోఁ
బ్రబలుచు నాత్మీయ భర్తకడకుఁ
గీ. జని తదీయోపచార పరిశస్తబుద్ధి
సహితయగుచును నిత్యంబు సత్వరమునఁ
జూపులను మంచిమాటలఁ జేపతేప
వశముజేసెను బ్రియుని నవ్వనజవదన. 425

క. శ్రీనుతుఁడైనను సంతత
దానోజ్జ్వలుఁడైనఁ గీర్తి ధన్యుండైనన్
మానవుఁడు జగములోపల
మానవతీ వచనములకు మార్పడఁగలఁడే. 426

క. పురుషుని మతి దొలగింపను
వెరవు విచారించి బ్రహ్మ విభవోన్నతుఁడై
తరుణులఁ బుట్టించెను సు
స్థిర రూపవిలాస వేష ధీసన్నుతులన్. 427

వ. అంత దితి కశ్యపునకు మనోనుకూలంబుగా నుపచారంబులుసేయుచు నొక్కనాఁడు సంతసంబునిగుడ నేకాంతంబున వివిధసంభోగములను విలాసవిభ్రమ కేళీవిలాసంబులఁ బ్రొద్దువుచ్చిన నతండు సుఖపారవశ్యంబున నిజకాంతనాలోకించి యిట్లనియె. 428

సీ. పురుషులు సంతుష్టిఁ బొందియుండెడిచోట
నతివల కీరాని దైన నొకటి
గలదె ముజ్జగములఁ గమలాక్షి యేమైన
నిచ్ఛాదరార్థంపు మీప్సితార్థ
మతివేడ్క సతులకుఁ బతియెదైవము విష్ణుఁ
డఖిలజీవులకెల్ల నాదివేల్పు
భర్తృరూపముచేత భామలకును విష్ణుఁ
డారాధ్యుఁడగుఁ దత్వమరసిచూడ

గీ. నాపరంజ్యోతి రూపము నాక్రమించి
పూజ్యుఁ డయ్యెడి నీచేతపూవుఁబోఁణి
సతులు గోరుదు రేమైన సంతసమున
నాత్మనాధుఁడు సుఖలీల నరయునపుడు. 429

క. అనిపలికిన దితియపు డి
ట్లనియెను మునివర్య దేవతాధిప తలఁద్రుం
పను జాల బలిమిఁగలిగిన
తనయుని నీయంగవలయు ధన్యచరిత్రా. 430

వ. ఇవ్విధంబున దితి యకర్తవ్యంబైన వరంబడిగినఁ బరితప్తుండై యా
కశ్యపప్రజాపతి శోకంబందుచు నిట్లనియె. 431

శా. పాతివ్రత్యముగల్గియుం దితిమహా పాపాత్మురాలైననుం
జేతోజాత సుఖంబులందనిపి నా చేతన్ మహాదోష వి
ఖ్యాతంబైన వరంబుఁ బుచ్చుకొన మాయాపూరిత స్వాంతయై
యేతెంచెన్ వడితో నధర్మమిఁక నేడెల్లనోకా దైనమా. 432

క. తరుణుల తలఁపులు మాయని
యెఱుఁగక వరమడుగమనిన నీభామిని దు
ష్కరమైన వరమునడిగెను
హరిహయుఁడునధింప నర్హుఁడగు నే తలఁపన్. 433

క. తరుణులు తమ పనిచేకొను
కొఱకై మాయాప్రయుక్త గుణములతోడన్
దిరుగుచుఁ జెఱుగఁ జూతురు స
త్వరులై నిజపతులనైనఁ దనయులనైనన్. 434

గీ. ఆననంబు వికసితాంభోజ సదృశంబు
భాషణంబు లమృత భాసురములు
చిత్తమధిక తీక్ష్ణత ఖడ్గధారాభ
మిట్టి సతులగుణము లెఱుఁగవశమె. 435

క. అడిగిన వరమిచ్చెదనని
నొడివియు నీకున్న యెడల నురువడి సత్యం
బెడలును దన్మూలంబున
నడలుచుఁ బడవలయు రౌరవాదుల యందున్. 436

సీ. అదియుఁగాన్పున సత్యముదుగకుండెడు నట్లు
గానొక్క వ్రతమునేఁ గల్పసంబు
చేసెద దితి దాని జేకూర్పలేమిఁ ద
ద్వ్రతనాశదోషంబు దగిలినంతఁ
బాకశాసను నడుపంగఁజాలు సుతుండు
మఱిసంభవింపఁడు మహిమమెఱసి
యిట్లైనచోట దేవేంద్రుండు సుఖయించు
నమరులతో నపాయంబులేక

గీ. యనుచు మదిలోన నీయుపాయంబు దలచి
క్రోధసందీప్తలోచనాకులితుఁడగుచు
లలితవాక్కులఁ దేనియల్ చిలుకుచుండ
నాత్మసతిఁజూచి మౌనితాననియెనిట్లు. 437

క. వ్రతమొక్కటి చెప్పెదఁ ద
ద్వ్రత మాచరణంబుసేయఁ దలఁపోపగఁ జా
జాలితివేని శక్రుఁ జంపెడి
సుతుఁ డుద్భవమొందు నీకు సురుచిరవదనా. 438

వ. అనిపలికిన ముదిత వికచవదనయై కశ్యపునకు దితియిట్లనియె. 439

శా. స్వామీ నీదయ నాయెడం గలిగినంజాలున్ మహాభక్తితో
నేమైనన్ వ్రతమాచరించెదను నే నిష్టార్థ సంసిద్ధికై
యా మేలైన వ్రతంబుసేయువిధ మెట్లందే విసర్జంబులౌ
నేమాసంబున నాచరింపఁదగు నాకీచందంబు దెల్పంగదే. 440

వ. అనిన మునీంద్రుండిట్లనియె. 441

చ. క్రమమునఁ జెప్పెదన్ వినుము కామిని మైకొని మార్గశీర్ష మా
సమునను శుక్లపక్షమున సౌమ్యదినంబుననుండి వత్సరాం
తము శుచియయ్యుఁ బ్రత్యహముఁ దప్పక భక్తిని విష్ణుపూజ చే
సి నేష్క్రతో ఁడుత భుజంపఁగ నొప్పగుఁ గాలపర్వమున్. 442

వ. మఱియును- 443

సీ. నఖ రోమ విచ్ఛేదసంబుసేయుట జంతు
సంఘుంబుఁజంపుట సత్యముడుగు
టనృతంబువలుకుట యాత్రలు నడుచుట
కంటకామేధ్యంబు లంటుకొనుట
సంధ్యలముక్తకేశయయి యుండుట మఱి
చేరి దుర్జనగోష్ఠి సేయఁబోక
సామిషాన్నోచ్ఛిష్ట చండికావృషలాన్న
భుక్తి సేయుట నిద్రఁబొదలుచుంట

గీ. నగ్నయై తీర్థమాడుట నరులఁగూడి
భూషణంబులు మానంబు పరిహరించు
టం జలినిజలముగోలుట యూడఁజనుట
కడకనియ్యవి వ్రతనాశ కారణములు. 444

వ. ఇట్లు వ్రతభలంశకరణంబులైన కర్మంబులఁ బరిత్యజించి శుచిత్వం
బున ధౌతవస్త్రంబులు ధరియించి దివ్యగంధపుష్పభూషణంబుల
మంగళమూర్తియై గోవిప్రనమస్కారపూర్వకంబుగా విష్ణునారా
ధింపుచు నిట్లు పుంసవనవ్రతంబు వత్సరపర్యంతంబును నిర్విఘ్నం
బుగా నాచరించిన నీకు శచీనాయకశిరశ్ఛేదన సమర్థుండగు కుమా
రుండు సంభవించునని చెప్పినవిని సంతసంబున నుప్పొంగి యాపావ
లోచన భర్తృవాక్యం బంగీకరించి తద్వ్రతాచరణంబుసేయుచుఁ
దత్ప్రభావంబున గర్భంబుధరియించె. నంతనింద్రుండు తద్వృత్తాంతం
బెఱింగి యాయింతిగర్భంబు వినాశంబుసేయుంబూని యనవరతం
బును గందమూలఫలసమిత్కుశ పత్రాంకురానయనాదివినయ సమ

స్థుండై తత్పరిచర్యాముఖంబున నత్తిచ్ఛిద్రంబు నిరీక్షించుచుండె
నని చెప్పి శుకుండు మఱియు నిట్లనియె. 444

సీ. అశుచియై యొకనాఁడు దా కశ్యపాంగన
కడుఁ గ్రిస్సి పరికీర్ణకబరి యగుచుఁ
జరమసంధ్యావేళఁ గరములు మోముపై
నిడుకొని నిద్రింప నింద్రుఁ డంత
వీక్షించి యుపసరం బిదియ నా కనుచును
నలకేల వజ్రంబు వాఁడిమెఱయ
యోగమాయాబలయుక్తుఁడై యాయింతి
కుక్షిఁ బ్రవేశించి క్రోధ మొదవ

గీ. నచటఁ దద్గర్భమే డువ్రయ్యలుగఁ జీల్చి
వానిఁ బ్రత్యేక మేడేసిగా నొనర్చె
ద్రోణపుత్రుని శరవహ్నిఁ బూన విన్ను
ఖండితములైన భవదంగకములమాడ్కి. 445

వ. ఇట్లు బహుప్రకారంబుల ఖండితంబులగు తత్ఖండంబులు విష్ణుమా
యా పరిపూర్ణంబగుటం జేసి మృతింబొందక కనకసమాన తేజంబునఁ
బొదలుచు నేకోనపంచాశత్సంఖ్యలం గలిగి మరుద్గణంబై యాశచీ
వల్లభునితోఁడఁగూడి తదగర్భంబు వెడలి రంత దితిమేల్కాని మరు
ద్గణసమేతుండై యున్న దేవనాయకుం గనుంగొని యిట్లనియె. 446

క. సురలకు మిక్కిలి సాధ్వస
కరుఁడైన కుమారుఁ డొకఁడు కలిగెడికొఱకై
పరిపూర్తి వ్రతము సలుపఁగ
నెఱుఁగము నిందరు తనూజు లెట్లొదవిరొకో. 447

చ. పరువడి రజ్జువందు ఘనపన్నగ బుద్ధిజనించినట్లు శు
క్తిరజతమంచు వేఁకను గేలధరింపఁగఁ బూనినట్లు సు
స్థిరమగు నామనంబు భ్రమఁ జెందెనొకో పరమేశుమాయయో
సురవర యీకుమారకుల చొప్పెఱిఁగింపుము నిర్భయంబునన్. 448

వ. అనిన దితితోఁ బురందరుం డిట్లనియె. 449

సీ. అమ్మ నీకెఱిఁగింతు నాద్యంతమును మృషా
భాషణంబులుగావు పద్మవదన
వ్రతలబ్ధమగు భవద్వర్ణిత గర్భమ
య్యమరులకును వైరమని యెఱింగి
యెదరు వేచుచునుంటి నేఁ బరిచారక
వ్యాజంబునను యుష్మదాశ్రమమున
నంత నీవేళ నీవశుచివై నిద్రా సు
ఖంబునఁ బొందుటగాంచి యిదియ

గీ. వేళయనుచును వజ్రంబు కేలఁబూని
కుక్షిఁజొరఁబడి యప్పుడు గుప్తమూర్తి
నగుచు గర్భంబు మొఱవెట్టినంతఁ దిగిచి
కినుకఁగోసితి నేఁడేడు తునియలుగను. 450

వ. ఇట్లే కోనపంచాశత్ప్రకారంబులగు భవద్గర్భంబు తద్వ్రత మహాత్త్వంబున విష్ణుకళాపరిపూరితంబై మృతిఁబొందక మరుద్గణనామంబునఁ బ్రకటంబయ్యెఁగాని మాయారూపంబుగాదు నేఁజేసిన యపరాధంబు క్షమియింపుమో తల్లి భవద్వ్రతభంగంబు చింతించి సమయవిచ్ఛేదనంబున గర్భంబు చొచ్చి పాపచిత్తుండనై వజ్రధారల గర్భంబు విదళనంబుఁజేసిన నాశకలంబులు చెడక మహాశ్చర్యంబై యివ్విధంబునం గుమారులైరి మహాపురుషబీజసంసిద్ధికి గార్యానుషంగిగాకుండునే భగవదారాధనంబు కోరికలం బాసి యెవ్వరు గావింతురు వారిహపరంబుల స్వార్థకుశలు లగుదు రిమ్మహాపురుషవ్రత సముత్పన్న తేజంబడంప నెవ్వఁడోపుఁగావున దుర్మదంబునఁ బాప స్వరూపుండనై ద్రోహంబుఁజేసిన నా దౌర్జన్య కర్మంబు సహింపు తల్లికన్న నెవ్వరు సమర్థులు. పాపాత్ముండగు నన్నుఁగావుము నేను పీరలతోడవాఁడనని నిష్కపటంబున సాష్టాంగ దండప్రణామంబు లాచరించిన నద్దేవియట్లకాకయని శాంతచిత్తయయ్యె. నింద్రుండు వారలం గూడి దివంబునకుం బోయి సోమ

పాన హవిర్భాగంబులు వారలకుఁ బంచియిచ్చిన సుఖంబుండిరని పరీక్షిత్తునకు శుకయోగీంద్రుండు చెప్పి మఱియు నిట్లనియె. 451

క. హరివరదుఁడైన వ్రతములు
హరివంశజులగుచు నెగడు నమరులజన్మ
స్ఫురణంబులు పఠియించిన
నరయఁగ గురుకర్మ దీర్ఘ హరమగు టసుదే. 452

వ. అని విష్ణుకథాశ్రవణ కుతూహలాయమాన మానసులైన శౌనకాది మహామునులకు సూతుండు పరమహంస చెప్పినట్లు శుకయోగీంద్రుండు పరీక్షన్నరేంద్రునకుఁ జెప్పెననుటయు మఱియును బుంసవనవ్రతప్రకారంబు వినిపింపుమనిన శుకయోగీంద్రుం డిట్లనియె. 453

ఉ. పుంసవనప్రభావమును బుణ్యమహావ్రత మాచరింప నే
మాసము ముఖ్యమైదనరు మానవకోటికి నిత్య సద్గుణా
వాసముకైన యోగి జన ణీతభాషణ దత్ప్రకార మి
చ్ఛాసహితంబుగా వినెదు సంతస మాత్మ బునించెఁ జెప్పవే. 454

వ. అని తద్వ్రత శ్రవణాయత్తచిత్తంబునఁ దత్తరించు మహీవల్లభునకు శుకుం డిట్లనియె. 455

సీ. అధికమాసమ్ము మాఘాద్యాది దోషవిహీన
మగుమార్గశిరమాస మందు శుక్ల
దశమి నాఁడే కభుక్తముఁజేసి పతిభక్తిఁ
బరగుచుఁ దదనుజ్ఞఁ బడసియుంతఁ
దెలివి నేకాదశీదినమున వరపుణ్య
తీర్థంబులో బ్రీతిదీర్థ మాడి
శక్రకల్పిత మరుజన్మమాకర్ణించి
సముచిత శుభ్రవస్త్రము ధరించి

గీ. నిజగృహంబున కేతెంచి ద్విజునితోడఁ
గూడి మంగళవాద్యముల్ గొనలుసాగ
స్వస్తివాచన సేవించి వర్ణితముగ
మంటపంబొందు కల్పించి మఱియునప్డు. 456

క. కలకొలది కాంచనంబున
జలజాయత నేత్రిఁ గూడి చక్రికిఁ గొనిన్
బొలుపొందఁజేసి యాప్రతి
మల నిలుపంగవలయు సదమల పీఠమునన్. 457

వ. ఇట్లు నిర్మితంబైన లక్ష్మీసమేతంబగు విష్ణుప్రతిమాతిశేషంబును రంగవల్లీసమేత ప్రదేశంబున సితతండులవిరచిత కమలకర్ణికామధ్యంబునఁ బాదుకొల్పి యాచార్య మూలంబున ద్వాదశాక్షరమంత్ర పూర్వకంబుగా నావాహనాసనార్ఘ్యపాద్యాది షోడశోపచారంబుల బూజయొనర్చి తన్మంత్రంబున ననలంబునందుఁ బాయసాద్యంబులచేత ద్వాదశాహుతులు వేల్చి ప్రతిదినంబు నిట్లు పూజాహోమంబులుచేసి ద్వాదశ దినంబున నిత్యకర్మంబు లాచరించి క్రమ్మఱభక్తపూజాపూర్వకంబుగాఁ దద్విష్ణుప్రణామం బాచరించి తత్సమ్ముఖంబున. 458

సీ. మరుమాత త్రైలోక్యమాతయై వెలసిన
శ్రీదేవి యురమునఁ జెన్నుమిగుల
శంఖ చక్ర గదా సిశార్ఙనందకములు
దివ్యహస్తములందు తేజరిలఁగ
వరఫణామణిదీప్తిఁ బరగుచు శేషుండు
ధవళాతపత్రమై పరగుచుండఁ
గంకణ కేయూర కటకభూషాహార
కాంతులు దిశలందుఁ గప్పుకొనఁగ

గీ. భక్తినిందాదివిబుధులు ప్రస్తుతింప
రత్నసింహాసనంబున రమణమెఱసి

సిరులకాలయమగుచు విచ్చేసియున్న
నీకు మ్రొక్కెద జగదీశ లోకజనక. 459

చ. తఱుఁగని రాజ్యవైభవ సుతప్రియభృత్య ధనాది సంపదల్
తిరమగునట్లుగా నొసఁగి దివ్యభవత్పదపద్మ భక్తియున్
సురుచిర దానధర్మములఁ జొప్పడు భక్తియు భర్తృసేవయున్
జిరతరవృత్తినిల్వ దయసేయుము నాకును శ్రీమనోహరా. 460

వ. అని యిట్లు లక్ష్మీవల్లభుఁ బ్రార్థించి నమస్కృతు లొనర్చి బంధు
సమేతంబుగా భుజియింపవలయు నీ ప్రకారంబున నాచార్యహస్తం
బు విష్ణుపూజాహోమంబులు ప్రత్యహంబును నాచరింపుచు నియ
మంబున నేకభుక్తంబుసేయుచు నిట్టి వ్రతంబు సంవత్సరపర్యంతం
బు సంపూర్తిగా నిర్విఘ్నంబున నాచరించి. 461

క. ఆదట కార్తికశుక్లై కాదశిఁ దాను
పవసించి ఘనహర్షమునన్
ద్వాదశిదినమునఁ దత్ప్రతి మాదాన
ము సేయవలయు మనుజాధీశా. 462

సీ. అంతట భక్తిచే నవనీసురేంద్రుల
హరిరూపమయులు గనావహించి
పుష్పగంధములచేఁ బూజించి ఘృతపూర్ణ
ముగ వేడ్క మృష్టాన్నములు నొసంగి
పతితోడఁ గూడి తద్భుక్తశేష నైవేద్య
మతులిత భక్తితో ననుభవించి
పతియె దైవంబని భావించి సద్భక్తి
మనమున హర్షించి మనెడునట్టి
గీ. కాంతలకునెల్ల కాలంబు కడుసమృద్ధి
యాయురారోగ్యభాగ్యముల్ వాయకుండు
నిట్టి వ్రత మాచరించిన యట్టి సతులు
పుత్రి ధనధాన్యసంపదల్ పొదవియుండు. 463

క. ఈ కథ వినినఁ బఠించిన
లోకంబుల జనులు సర్వ లోకోత్తరులై
యేకాలంబును సురత సు
ఖాకరులై మనుదు రాయు రారోగ్యములన్. 464

వ. అని యిట్లు శుకయోగీంద్రుండు పరీక్షన్నరేంద్రునకుఁ బుంసవన వ్రతప్రకారంబు చెప్పెనని సూతుండు శౌనకాది మహామునులతోఁ జెప్పెనని మఱియును. 465

ఉ. సారసపత్రనేత్ర బుధసన్నుత దుష్టనిశాటపాట నా
చారవిహారహార రుచి సౌమ్యయశో మహనీయ నిత్య శృం
గారశరీర మేఘ నిభకాయ నిరస్తసమస్తమోహ సం
స్మేర ముఖారవిందరఘు శేఖర శ్రీకర శత్రుభీకరా. 466

క. దశరథరాజ తనూభవ
దశకంఠచ్ఛేద నిపుణధైర్యాచల ద్వా
దశరూపకోటి తేజా
దశదిగ్గజకీర్తికామ దశరథరామా. 467

మాలిని. అనుపమగుణజాలాభ్యర్థితాత్మానుకూలా
వనధిబలవిరామా వర్ణితారాతిభీమా
ఘనసురుచిరదేహా గాఢవిధ్వస్తమోహా
జననమరణదూరా జానకీచిత్తచోరా. 468



* గద్య *

ఇతి శ్రీ పరమేశ్వర కరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీ మహా భాగవతంబను మహా పురాణంబునందు నరకనిరూపణంబును, నజామిళోపాఖ్యానంబును, విష్ణుదూతల యమదూతల సంవాదంబును, బ్రహ్మ చేతసులం జంద్రుండు కోపనివారణంబు సేయుట, దక్షోత్పత్తియుఁ బ్రజాసర్గంబును దక్షుండు శ్రీహరిం గూర్చి తపంబు సేయుటయు నతనికిఁ బరమేశ్వరుండు ప్రత్యక్షంబగుటయు, హర్యశ్వశబలాశ్వుల జన్మమును, వారల నారదుండు బోధించుటయు, నారదుండు దక్షుశాపంబు పరిగ్రహించుటయు, దేవాసురనరతిర్యఙ్మృగాదుల జన్మంబులును, దివిజ పలాయనంబును, బ్రహ్మవాక్యంబున విశ్వరూపుని నాచార్యునిగా దేవతలు వరించుటయు, శ్రీమన్నారాయణ కవచ ప్రభావంబును, విశ్వరూపు శిరోహననంబును, వృత్రాసుర జననంబును, దివిజపలాయనంబును, సురలకు నారాయణుండు ప్రసన్నుండగుటయు, వజ్రాయుధంబుకొఱకు దధీచిశల్యంబులు గొనుటయు, వృత్రాసురవధయును, నింద్రుండు బ్రహ్మహత్యాహతుండగుటయు, నహుషుండగస్త్య శాపంబున సురరాజ్యభ్రష్టుండై యజగర రూపంబగుటయు, నింద్రాగమనంబును, నశ్వమేధంబును, జిత్రకేతూపాఖ్యానంబును, నింద్రుండు త్రిలోకపాలకుం డగుటయుఁ, బుంసవనవ్రతంబును, మరుద్గణజన్మప్రకారంబును నను కథలం గల

షష్ఠ స్కంధము

సంపూర్ణము.

మంగళం మహత్.

శ్రీ శ్రీ శ్రీ

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 22 | దాసిటు | దాసి |
| 7 | 5 | శ్లోభాతతి | శ్లోఘాతి |
| 7 | 12 | నీకును | నిదగు |
| 11 | 3 | శార్జ | శార్జ |
| 11 | 7 | మనా | నామ |
| 18 | 12 | దిర | రిర |
| 20 | 28 | జగదీ | జగధీ |
| 22 | 26 | భావింతుదు | భావింతురు |
| 24 | 27 | భక్తి | భక్తు |
| 25 | 23 | స్సేయు | సేయు |
| 29 | 5 | భూష | భాష |
| 33 | 5 | అట్టి | ఎట్టి |
| 37 | 21 | డశ్వనీ | దశ్వనీ |
| 38 | 4 | చారశ్రేణులు | చామీకరశ్రేణి |
| 40 | 2 | ముంచి | ముంచిత |
| 41 | 7 | నాభ | నాభీ |
| 47 | 21 | పత్యు | పథ్యు |
| 47 | 21 | ద్వంద్యు | ద్వంద్వ |
| 47 | 25 | సంగవ | సంగమ |
| 48 | 4 | జనార్థ | జనార్ద |
| 52 | 7 | వేదుండు | వేద్యుండు |
| 58 | 8 | టింటి | టింట |

| పేజి | పంక్తి | తప్పు |
|---|---|---|
| 58 | 9 | కుతిరి |
| 61 | 18 | వాన్వ్రయు |
| 63 | 3 | మేంత |
| 87 | 1 | ఇ దే |
| 103 | 19 | జాలితి |
| 104 | 12 | నో్మచ్ఛి |
| 107 | 14 | జనణిన్ |
| 107 | 15 | బునించె |
| 108 | 9 | లక్షి |
| 108 | 9 | ప్రిపిమాతి |
| 108 | 14 | ద్యాంబు |
| 108 | 20 | శార్జ |
| 109 | 4 | త్రుద |
| 109 | 7 | లక్షి |